## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016156



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

*Approved for school use-Part I B Page 181*
*Fort St. George Gazette 4-4-1933.*

# బాలకథాకౌముది



గ్రంథకర్త

పండిత డి. సీతారామారావు

నాల్గవ కూర్పు 1000 కాపీలు.

పబ్లిషర్

బి. బి. కారిశింగ్,

ఆంధ్ర బుక్కు డిపో—గుంటూరు.

**1937**

 [వెల 0-6-0

# విషయసూచిక

ఓం

# బాలకథాకౌముది

## ౧. రాముఁడు

( తండ్రియాజ్ఞఁ బాలింపుము )

పూర్వకాలమున దశరథుఁడను రాజు అయోధ్యానగరమును బాలించుచుండెను. అతనికి మువ్వురు భార్యలు గలరు. పెద్దభార్య కౌసల్య. తక్కినవారు సుమిత్రాకైకలు. అందుఁ గౌసల్యకు రాముఁడును, సుమిత్రకు లక్ష్మణుఁడు-శత్రుఘ్నుఁడును, కైకకు భరతుఁడు-ననుకొడుకులు పుట్టిరి. దశరథునకు శ్రీరామునియందు మిగుల ప్రేమ. రాముఁడు భగవంతుఁడే యని యతఁడు తలఁచుచుండును. రాముని విడిచి యాతఁ డొక్కనిమిషమయిన నుండలేఁడు. లోకమంతయు నాతనికి రామమయముగనే కనఁబడుచుండును.

ఒకప్పుడు దశరథుఁడు-రాక్షసులతోఁ బోరుటకు దేవతలకు సహాయము జేయఁబోయెను. అప్పు డాతని వెంటఁ గైక కూడ నుండెను. యుద్ధము సేయునప్పుడు దశరథుఁడు స్మృతి తప్పి పడెను. అట్టిసమయమున నాతఁడు శత్రువులకుఁ జిక్కకుండఁ గైక రథమును యుద్ధభూమినుండి తొలగించెను. దశరథుఁ డామె తెలివికి మెచ్చి రెండువరము లిచ్చెను. కాని యావరముల నిమ్మని కైక యెప్పుడును నడిగియుండలేదు. అనేకసంవత్సరములు గడచిపోయెను.

రామునకు యుక్తవయస్సు వచ్చెను. దశరథుఁ డాత నికి రాజ్యాభిషేకముసేయుటకు నిశ్చయించెను. కైకయొద్ద మంథర యనుదాసి యుండెను. కైకకు నాదాసియందుమిక్కిలిప్రేమ. దుష్టబుద్ధిగల యామంథర - భరతునకుఁ బట్టము గట్టునట్లు రాజును వరము వేడుమని కైకకు బోధజేసెను. అంతట కైక దశరథుని-బూర్వము యుద్ధములో నిచ్చిన వరముల నిప్పుడిమ్మని యడిగెను. దశరథుఁ డందులకు సమ్మతించెను. కైక దశరథునిఁజూచి "నా కొడుకయిన భరతునకుఁ బట్టముగట్టవలయును. మునివేషముతోఁ బదునాల్గు సంవత్సరము లడవిలో వసించుటకు రామునిఁ బంపవలయు" నని పలికెను. "రాముని విడిచినచో నేను బ్రతుకను. వలసె నేని భరతునకుఁ బట్టముగట్టెద" నని దశరథుఁడు కైకను బ్రతిమాలుకొనుచుఁ జెప్పెను. కైక వినలేదు. సత్యసంధుఁడైన దశరథుఁడు మారుమాటాడలేకపోయెను. దశరథుఁడు రాముని బిలిపించెను. కైక రామునకుఁ దనవరములసంగతిఁ దెలిపి "కుమారా! నీవు తండ్రిసత్యమును గాపాడఁదలతు వేని యరణ్యముల కరుగు" మని పలికెను. రాముఁ డామెకు నమస్కరించి "అమ్మా! నీవునాకు మిగుల నుపకారము జేసితివి. నీదయవలన నాకు అరణ్యములో మునిసేవ లభించును. తమ్ముఁడయిన భరతుఁడు రాజగుటకంటె నాకుఁ గావలసిన భాగ్య మేమున్నది? నీయాజ్ఞ ననుసరించి నేను వనముల కేగెదను" అని సంతోషముతోఁ బలికెను.

తండ్రిసత్యము గాపాడుటకు రాముఁ డరణ్యముల కేగెను. ఆతనితో-భార్యయగు సీతయు, దమ్ముఁడైన లక్ష్మణుఁడుగూడ నరిగిరి. రాముఁ డరణ్యమునకుఁ బోయినమూఁడు దినముల కాతనిమీఁద బెంగచే దశరథుఁడు మరణించెను. చిత్రకూట పర్వతముపైనున్న రామునియొద్దకు భరతుఁ డరిగి తండ్రిమృతిఁ దెలిపి, నగరమునకు రమ్మని ప్రతిమాలెను. రాముఁ డందుల కొప్పుకొనలేదు - ఆతఁడు పదునాల్గు సంవత్సరములును - అరణ్యమునఁ జరించి-తరువాత అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడయ్యెను.

## ౨. శ బ రి

( సజ్జనులను బూజింపుము )

పూర్వము శబరి యనునొక శూద్రస్త్రీ యుండెను. ఆమె చిన్నతనమునుండియు భక్తురాలై యుండెను. నానాటి కామెభక్తి హెచ్చిపోయెను. అంతట నామె తపస్సు జేసికొనుటకై యొకయరణ్యమునఁ బ్రవేశించెను. అరణ్యమున నున్న మునీశ్వరులను జేరి, వారికి సేవలుజేసి దివ్యమైన జ్ఞానమును సంపాదించెను. ఆమె యరణ్యమున నొకకుటీరమును నిర్మించుకొని తపస్సు జేసికొనుచుండెను.

ఇట్లుండ, రావణునిచే నపహరింపఁబడిన సీతను వెదకుచు రాముఁడు శబరియాశ్రమమునకు వచ్చెను. ఆతనిరాకకు శబరి మిగుల నానందమును బొంది, పెక్కువిధములఁ బూజించెను. మంచిఫలములు దెచ్చి రామునకు సమర్పించెను. రాముఁ

డామె చేసినపూజను మిక్కిలి కొనియాడెను. అప్పు డా
యోగినియైన శబరి రాముని జూచి "రామచంద్రా! నీవు
భగవంతుఁడవుగాని సామాన్యమానవుఁడవు కావు. నీ వీప్రదే
శమునకు వత్తువని నాకు నా గురువులు చెప్పియుండిరి. నా పుణ్య
ముచేత నేడు నిన్నుఁ జూచితిని. నిన్నుఁ బూజించుటచేత నా
పాపముల బాసితిని. ఇఁక నీదయవలన నేను మోక్షమునకుఁ
బోవుదు," నని భక్తిమీఱఁ బలికెను. రాముఁడామె కిట్లనెను.
"శబరీ! నీవు ధన్యురాల వయితివి. భగవంతునియందుఁ
జిత్తము నిలిపియున్న నీవు ఉత్తమలోకములను బొందుదువుగాక.

## ౩. పాండవులు

(ధర్మమే జయము నిచ్చును)

హస్తినాపురమును ధృతరాష్ట్రుఁడను రాజు పాలించెను.
ధృతరాష్ట్రుని తమ్ముఁడు పాండురాజు. ధృతరాష్ట్రునకు నూరు
గురు కొడుకులును, పాండురాజునకు నైదుగురు కొడుకులును
గలరు. ధృతరాష్ట్రుని కుమారులు కౌరవులనియుఁ, బాండు
రాజుకుమారులు పాండవులనియుఁ బిలువఁబడిరి కౌరవులలోఁ
బెద్దవాఁడు దుర్యోధనుఁడు - ధర్మజభీమార్జున నకులసహదేవు
లేవురును బాండవులు. వీరు ధర్మబుద్ధి గలవారు. కౌరవులు
దుష్టబుద్ధి గలవారు. కౌరవులు - పాండవులను బాల్యము
నుండియు నసూయతోడనే చూచుచుండిరి. పాండవుల రూపు
మాపవలయుననియే ప్రయత్నములు సేయుచుండిరి. ధర్మ

బుద్ధిగల పాండవులు కౌరవులు తమకుఁజేయు నేరములను లక్ష్య
పెట్టక భగవంతుని నమ్మి, ధైర్యము విడువక యుండిరి.

కౌరవకులగురువగు భీష్మాచార్యునిచేత ధృతరాష్ట్రుఁడు
పాండవుల కెగ్గుసేయుచున్న తనకొడుకులను వారించుచుం
డెను - ఎట్లో అతఁడు పెద్దలమాటలు విని పాండవులకు ఇంద్ర
ప్రస్థపుర రాజ్యము నిచ్చెను. ధర్మరాజు—తన నలుగురుతమ్ములు
భక్తితోఁ గొలువ నింద్రప్రస్థమునుండి సుఖముగా రాజ్యము
పాలించుచుండెను. ప్రజ లెల్లరును ధర్మజుని పెక్కువిధములఁ
గొనియాడుచుండిరి. పాండవులకుఁ గృష్ణుఁడు రక్షకుఁడై
యుండెను. ధర్మరాజు కృష్ణుని యనుగ్రహమున రాజసూయ
యాగము జేసెను. ఆయాగమహోత్సవము జూచుటకు
నానాదేశపు రాజులు వచ్చిరి. కౌరవులు గూడ వచ్చిరి.
చూడవచ్చినవా రందఱును అట్టియాగము పూర్వమెన్నఁడు ఎవ్వరి
చేతను చేయఁబడి యుండలేదని తలంచిరి. దుర్యోధనుఁడు
యాగవైభవమును జూచి యోర్వలేకపోయెను. అతఁడు
హస్తినాపురమును జేరి, ఎట్లో తండ్రిని సమ్మతింపఁజేసి ధర్మ
రాజును జూదమాడుటకు రావించెను. అది మాయాజూదము.
అందులో ధర్మరాజు తనరాజ్యమును, ధనమును, తుదకుఁ
బాండవులందఱికిని భార్యయైన ద్రౌపదినిగూడ నోడిపోయెను.
దుర్యోధనుఁడు నిండుసభయందు ద్రౌపది వలువ లొలి
పించెను కాని, కృష్ణునిదయచేత నామె కట్టియున్నమానమును
జరుగలేదు - విదురాదివృద్ధులమాటలు విని, జూదమున

నోడిన రాజ్య మంతయు మరల ధర్మరాజున కిచ్చి వేసి యింద్రప్రస్థమునకుఁ బంపివేసెను.

కొన్నాళ్ళకు మరల దుర్యోధనుఁడు ధర్మరాజును జూదమునకుఁ బిలిచెను. మాయాజూదమగుటచే నిందు గూడ ధర్మరా జోడిపోయెను. జూదమునకు ముందు చేసి కొన్న శపథము ననుసరించి పాండవులు పండ్రెండేండ్లు వన వాసమును, ఒకయేఁడు అజ్ఞాతవాసమును, జేయవలసివచ్చెను. ధర్మమునకుఁ గట్టువడి పాండవులు తమశపథము దీర్చుకొని వచ్చి, తమ యర్థ రాజ్యభాగము నిమ్మని దుర్యోధను నడిగిరి. కృష్ణుని దూతగాఁ బంపిరి. కౌరవు లందులకు సమ్మతింపలేదు. ఆకారణమునఁ గౌరవపాండవులకు గొప్పయుద్ధము జరిగెను. అదియే భారతయుద్ధము. శ్రీకృష్ణుఁడు పాండవ పక్షమున నుండెను. యుద్ధములోఁ గౌరవులందఱును మరణించిరి. ధర్మపరులగు పాండవులకు జయముకలిగెను. ధర్మ మెచ్చట నుండునో యచ్చట జయ ముండునుగదా! హస్తినాపుర రాజ్యమునకు ధర్మరాజు రాజయ్యెను.

## ౪. త్రిశంకుఁడు

(గురునియాజ్ఞ మీఱునానికిఁ గష్టములుకలుగును)

పూర్వము సూర్యవంశమున త్రిశంకుఁ డనునొకరా జేండ్రుఁ డయోధ్యాపురమును బాలించుచుండెను. ఆతఁడు మిగులధర్మాత్ముఁడు. అసత్య మాడఁడు. ఆశ్రయించినవారిని

రక్షించుచుండును. అనేక దానధర్మములు చేసెను. ప్రజ
లెల్లరును వినుతింప నాతఁడు పెక్కు వత్సరములు రాజ్య
మేలెను. ఆతనికిఁ బొందితో స్వర్గమునకుఁబోవ వాంఛకలి
గెను. ఆతఁడు తనగురుఁడైనవసిష్ఠుని రావించి భక్తితోఁ
బూజించి యిట్లుపలికెను. "మహాత్మా! నేను బొందితో
స్వర్గమునకుఁ బోవలయును. తపోమహిమయందు నిన్ను
మించినవా రెవ్వరును లేరు. మాసూర్యకులజులకు భాగ్య
వశమున నీవు గురుఁడవైయుంటివి. నాయందు నీవు కరుణఁ
బూనితివేని నేను బొందితో స్వర్గమున కేగుదును. కావున -
నెట్లయిన నా యభీష్టముదీర్చుటకు నీవు ప్రయత్నింపుము."

వసిష్ఠుఁడు త్రిశంకునిమాటలు విని "రాజా! నీ కోరిక
సామాన్యమైనది కాదు. అట్టి దానికొఱకు మన మెంత ప్రయ
త్నముజేసినను లాభముండదు-బొందితో స్వర్గమునకుఁ బోవు
దువని చెప్పి, నీచేత నాయాగక్రతువులు మొదలయినవి చేయిం
చుటకు నాచిత్తము సమ్మతింపదు. కావున నీవాకోరికను వద
లుము, అని చెప్పెను. త్రిశంకుఁడు గురునిమాటలకుఁ దృప్తిఁ
బొందలేదు-తరువాత నాతఁడు వసిష్ఠుని కొడుకులయొద్ద కేగి
తనకోరికను దెలిపెను. వారు త్రిశంకునిజూచి "రాజేంద్రా!
మహాతపోమహిమగల మాతండ్రి నీకు గురుఁడై యుండఁగా
నీవు మాయొద్ద కేలవచ్చితివి. నీ కోరిక యాతనికిఁ దెలుప
లేదా" యని యడిగిరి. "వసిష్ఠుఁడికార్యము సాధ్యముగా
దని చెప్పె" నని త్రిశంకుఁడు వసిష్ఠపుత్రులకుఁ జెప్పెను.
అందులకు వారు నవ్వి "మాతండ్రికి సాధ్యముకానిపని మాకు

సాధ్యమగునా! బొందితో స్వర్గమునకుఁ బోవుట యన్న సామాన్యమా! ఇట్టిది యెవ్వరికిని లభింపదు. ఇఁక నట్టియాశ పెట్టుకొనకు"మనిరి. ఆమాటలకుఁ ద్రిశంకునకు నాగ్రహము కలిగి, వారిని దూషించెను. తమ్ముఁ నకారణముగ దూషించి నందులకు వసిష్ఠునికొడుకులకుఁగూడ కోపమువచ్చెను. వారు త్రిశంకుని "చండాలుఁడవు గ"మ్మని శపించిరి. మునులవాక్యము తప్పునా! వసిష్ఠునికుమారుల శాపముచేతఁద్రిశంకుఁడు మాలవాఁడయ్యెను.

అట్టి శాపము నందినను ద్రిశంకునకు బొందితో స్వర్గమునకు బోవలయు ననుకోరిక పోలేదు. దానింగూర్చిన పట్టుదల నాతఁడు విడువలేదు. ఆతఁడు విశ్వామిత్రమహర్షి యొద్దకుఁ బోయి తనకోరికఁ దెలిపెను. విశ్వామిత్రుఁడు "రాజేంద్రా! నీవు దీనికై చింతింపవలదు. నాతపోమహిమ చేత నిన్ను బొందితో స్వర్గమునకుఁ బంపెద" నని పలికెను. త్రిశంకుఁడు సంతోషించెను. పిదప, విశ్వామిత్రుఁడు త్రిశంకునిచే నొక గొప్పయాగము చేయించి, తన మహిమచే స్వర్గమునకుఁ బంపెను. కాని, దేవతలు త్రిశంకుని జూచి, "నీవు చండాలుఁడవు. స్వర్గమునకుఁ వచ్చుటకుఁ దగవు", అని పలుకుచు క్రిందకుఁ బడఁద్రోసిరి. ఇప్పుడు త్రిశంకుఁ డేమి చేయఁగలఁడు? "నన్ను రక్షింపుము. రక్షింపుము", అని విశ్వామిత్రమునీంద్రుని వేడికొనెను. విశ్వామిత్రుఁ డాత్రిశంకుని మొరవిని "భయపడవలదు" అనిపలికి తన తపస్సామర్థ్య

మున నాతని భూమిపైఁ బడకుండ నక్కడనే నిలిపి, యా స్థలమునకుఁ ద్రిశంకుస్వర్గమని పేరుబెట్టెను. గురునిమాటను వినకపోవుటచే, నాత్రిశంకున కట్టిస్థితి సంభవించెను. అతఁడు బొందితో స్వర్గమునకుఁ బోవలేకపోవుటయే గాక, భూమి యందైన నుండలేకపోయెను. ఆకాశమునకును భూమికిని మధ్య నూగులాడుచుండెను. ఎట్టియాధారము లేక యున్న వానిని త్రిశంకుస్వర్గములోనున్నాడని మనవారు చెప్పుచుండు సామెత యీకథవలననే వచ్చినది.

## ౫. మాండవ్యుఁడు

### ( జీవహింసఁ జేయరాదు )

మాండవ్యుఁడను నొకమునీంద్రుఁడుండెను. ఈతఁడు బాల్యమున తూనీగలకు ముండ్లుగ్రుచ్చి, యవి బాధచే నటు నిటు గొట్టుకొనుచుండ, నవ్వుచు నాడుకొనుచుండెడువాఁడు. ఈతఁడు పెద్దవాఁడైన తరువాత, తపంబునఁ బ్రవేశించి యొక చోట నాశ్రమమునిర్మించుకొని యందుండెను. ఇట్లుండ నొక నాటిరాత్రి మాండవ్యుని యాశ్రమమునకు సమీపములో నున్ననగరమున నొకధనికునిఇంట దొంగలుపడి, యాభరణ ములు మొదలగునవి దొంగిలించుకొనివచ్చుచుండిరి. ఇంతలో నింటివారు మేల్కొని "దొంగలు, దొంగలు" అనికేకలు బెట్టిరి. రాజభటు లాకేకలు విని పరుగెత్తికొనిపోయిరి. ముందు దొంగలు పరుగెత్తుకొని పోవుచుండుటఁజూచి రాజ భటులు వారిని వెన్నంటిరి. దొంగలు కడురయమునఁబోయి, మాండవ్యునియాశ్రమముఁ జొచ్చి యొకమూల దాగియుండిరి.

దొంగలవెనుకనే రాజభటు లాశ్రమమును బ్రవేశించి, మాండవ్యునిఁజూచి "ఇటు దొంగలు వచ్చిరి, ఎటుఁ బోయిరి?" అని యడిగిరి. మాండవ్యుఁడు కన్నులు మూసికొని తపస్సు జేసికొనుచుండుటచే, నాతఁడు రాజభటుల మాటలను వినిపించుకొనలేదు. అదియును గాక, చోరులు తనయాశ్రమములో డాగియున్న సంగతి యాతనికిఁదెలియదు. రాజభటు లాశ్రమద్వారంబున నుండుటచేఁ దస్కరు లెక్కడికిని బోవలేక పోయిరి. రాజభటులు వారిని బట్టుకొనిరి. దొంగలు తెచ్చిననగలు కొన్ని తొందరచే జారి యాశ్రమములోఁబడెను. మాండవ్యుఁడుగూడ దొంగలలోనివాఁడే యనియు, తపస్సుఁ జేసికొనుచున్నవానివలె నటించుచుండెనని యుఁ దలంచి, రాజభటులు మాండవ్యునిఁగూడ దొంగలతో బంధించుకొనిపోయిరి. న్యాయాధికారియాజ్ఞ ననుసరించి, దొంగలతోఁబాటు మాండవ్యుఁడుగూడ కొఱత వేయఁబడెను. పెక్కుదినములు గడచెను. కొఱత వేయఁబడిన మాండవ్యుఁడు మిగుల బాధపడుచుండెను. ఇట్లుండ నొకనాడు, ఆమార్గమునఁ గొందఱు మునీశ్వరులు బోవుచుఁ గొఱతయందున్న మాండవ్యునిఁజూచి, యాతనికడకు వచ్చి - యాసంగతి యంతయుఁ దెలిసికొనిరి. ఆమునులు న్యాయాధికారియొద్దకుఁ బోయి, కొఱత వేయఁబడినవాఁడు మాండవ్యమునీంద్రుఁడని తెలిపిరి. న్యాయాధికారి-మిగుల భయమందుచువచ్చి మాండవ్యు కొఱతనుండి తీయించి "మహాత్మా! నన్ను మన్నింపుఁడు. అపరాధము జేసితినని పలికెను. మాండవ్యుఁడు తన

యాశ్రమమునకుఁ బోయి యెప్పటియట్లు తపస్సు జేసికొను
చుండెను. ఒకప్పుడు మాండవ్యుఁడు దేవలోకమునకుఁ బోయి
నప్పు డచ్చటికి యముఁడు వచ్చెను. ఏవో మాటలసందర్భ
మునఁ దాను కొఱతశిక్ష ననుభవించితినని మాండవ్యుఁడు
యమునితోఁ జెప్పెను. అందులకు యముఁడు "బాల్యమున
నీవు తూనీగలఁ జంపి యాడుకొనిన కారణమున నట్టిశిక్షఁ
బొందవలసివచ్చిన"దని మాండవ్యునకుఁ దెలిపెను.

## ౬. దుర్వాసుఁడు.

( పెద్దమాటలు చెఱుపుఁ దెచ్చును )

పాండవులు అరణ్యములోనున్నను, దుర్యోధనుఁడు
వారి కెప్పుడును నేదయినహాని జేయవలయుననియే తలంచు
చుండును. ఒకనా డతనియొద్దకు దుర్వాసమునీంద్రుఁడు
వచ్చెను. అతఁ డామునీంద్రుని భక్తితోఁ బూజించి, విందుఁ
జేసెను. దుర్వాసుఁడు సంతోషించి "దుర్యోధనా! నీవు
నాకుఁ బెట్టినభోజనమునకు మిగుల సంతోషించితిని. నీ కొక
వరమునిచ్చెదను, కోరుకొనుమని పలికెను. ఎట్లయిన పాం
డవుల కవమానము గలిగింపవలయునని దుర్బుద్ధితో నున్న
దుర్యోధనుఁ డాదుర్వాసునితో "మునీంద్రా నా కెట్టిగొప్ప
కోరికయు లేదు. కాని యొక్కటిమాత్రము కోరుచున్నాను.
నీవు నాయెడలఁ గృపఁబూని దానిని దీర్పవలయును. నీవు
నాయొద్దకు వచ్చినట్లే - ద్వైతవనములో నున్న పాండవుల

యొద్దకుఁ బోయి భుజించిరావలయును. అప్పటికి నీవర్ధరాత్రి సమయమునఁ బోయితివేని నేను సంతసింతు" నని పలికెను. పాండవు లరణ్యమున నుండుటచే-దుర్వాసునకు నర్ధరాత్రి సమయమున వారు భోజనము బెట్టలేరనియు, నందులకు దుర్వాసునకు వారిపై నాగ్రహము కలుగుననియు దుర్యోధనుఁ డూహించెను. దుర్యోధనునికోరిక దీర్తునని చెప్పి దుర్వాసుఁడు వెడలెను.

ఒకనాటిరాత్రిసమయమున దుర్వాసుఁడు పెక్కుమంది శిష్యులతో ద్వైతవనములోనున్న పాండవులయొద్దకుఁబోయెను. పాండవులు ఆమునీంద్రుని భక్తితోఁబూజించిరి. దుర్వాసుఁడు వారింగాంచి "నాకును, నాశిష్యులకును మిక్కిలియాకలియగు చున్నది. కావున మాకు ముందుగ భోజనముఁ బెట్టవలయు" ననిపలికెను. ఆసమయమునఁ గృష్ణుఁడు పాండవులయొద్ద నుండెను. ద్రౌపది కృష్ణునిజూచి "దేవా! ఈయర్ధరాత్రిసమయ మున నీమునీంద్రునకు శిష్యసహితముగా నెట్లు భోజనముఁ బెట్టుదును. ఈతఁడు మా కేదియో యవమానము గూర్చుటకు వచ్చియుండును,ఏమి సేయుదు"ననెను."మహాత్ముఁడయినయీ తఁడు వచ్చినప్పుడు మీరు తగువిధమునఁబూజింపవలయును. ఈసమయమున భోజన మెట్లు వచ్చునని విచారించినందువలన లాభ మేమియున్నది? పాత్రియం దేమయిన నన్న మున్న దేమో చూడు" మని కృష్ణుఁడు పలికెను. అందులకు ద్రౌపది "పాత్రి నింతకుముందే శుభ్రపరచితిని. అందులో నన్న మె ట్లుండు"నని చెప్పఁగాఁ, గృష్ణుఁ డాపాత్ర నిటుఁ గొనిరమ్మ

నెను. శుభ్రపరచియుంచిన పాత్రను దెచ్చి ద్రౌపది కృష్ణున కిచ్చెను. కృష్ణుఁడు దానిం జూడఁగా నెక్కడనో యొకమూల నొక మెతుకంటుకొని యుండెను. కృష్ణుఁడా మెతుకును నోట వేసికొని యక్షయమని పలికెను. భగవంతుని మహిమకు సద్దు మేమి యున్నది? ఇఁక నెంతమందికైనను బాండవు లాయర్ధ రాత్రి సమయమున విందుసేయఁగలరు. ద్రౌపది - దుర్వా సునిఁజూచి 'మునీంద్రా! మీరుమిగులనాకలిఁగొనియున్నారు. సత్వరముగ స్నానముజేసిరండు, భుజింతురుగాక" యనివినయ ముతోఁ బలికెను. దుర్వాసుఁడు శిష్యసహితము గా స్నానము జేసి వచ్చెను. ద్రౌపది - వారికి షడ్రసోపేతముగా భోజనము బెట్టెను దుర్వాసుఁడును, శిష్యులును చక్కగా భుజించిరి. కాని, వారికడుపు లుబ్బిపోవుచుండెను. కదలలేక యుండిరి. ఆయాస మధికమగుచుండెను. దుర్యోధనునిమాటలు విని యిట్లు వచ్చినందులకుఁ దనకే పరాభవము జరిగినదనియు, నదియంతయుఁ గృష్ణునిమహిమయనియు దుర్వాసుఁడు దలం చెను. ఆతఁడు కృష్ణునిజూచి "కృష్ణా! మమ్ము రక్షింపుము. మేము నిలువలేకయున్నాము. చెడ్డమాటలు చెఱుపు దెచ్చు ననుసామెత నిజమయినది. దుర్యోధనునిపంపునఁ బాండవులకుఁ బరాభవము సేయఁదలఁచి వచ్చి నేనేపరాభవమొందినాఁడ" నని పలికెను కృష్ణుఁడు-భయమం దవలదని పలికినంతనే, దుర్వాసునకును - శిష్యులకును దమకుఁ గలిగినబాధ తగ్గిపో యెను. తరువాత దుర్వాసుఁడు పాండవులధర్మసంధతనుపొగడి శిష్యులతో వెడలెను.



# ౨. యయాతి

(గర్వము కూడదు)

భరతకులమున యయాతి యనునొకరా జుండెను. అతనికొడుకులలోఁ బూరుఁ డనువాఁడే - తనయాజ్ఞఁ బాలించినవాఁడగుటచే వానికే రాజ్యమునంతయునిచ్చివేసి తపస్సు జేసికొనుటకు అరణ్యమునకుఁ బోయెను. ఆతఁడు పెక్కేండ్లు తపస్సు జేసి, భగవంతుని యనుగ్రహమువలన స్వర్గలోకమున కేగెను.

అనేకయాగములు జేసినవాడనియు, పెక్కుదానధర్మములొనర్చినవాఁడనియు, గొప్పతపస్సు జేసినవాఁడనియు, నింద్రుడు యయాతి నెక్కువగ గౌరవించుచుండెను. ఒకనాడు దేవేంద్రుఁడు పెక్కండ్రుమునులతోఁ సభఁదీర్చియుండెను ఆసభలోఁబుణ్యావిశేషములనుగూర్చి యొకప్రశ్న వచ్చెను. ఎవరికిఁ దోచినట్లు వారు ప్రత్యుత్తరముఁ జెప్పుచుండిరి. అప్పుడు యయాతి మహేంద్రునిఁజూచి "పుణ్యముఁజేసినవారికి-వారి వారి పుణ్యముననుసరించి యొక్కొక్క పుణ్యమునకు నొక్కొక్కదివ్యపదవి యుండవలెననెను. ఆమాటలు విని దేవేంద్రుఁడు యయాతిని "నీవేమిపుణ్యము జేయుటచేత నిట్టి పదవి నందితి"వనియడిగెను. అందులకు యయాతి యిట్లు చెప్పెను. "దేవేంద్రా! నేను రాజ్యమును ధర్మముననుసరించి పరిపాలించితిని. అర్థులకోరికలఁదీర్చి వారిని సంతృప్తిపఱచితిని అనేక దానధర్మములుజేసితిని. పెక్కుయాగములు గావించి

తిని. ఇంక ననేకమైన పుణ్యకార్యములఁ జేసితిని. ఇంతయేల?
నేను చేసిన పుణ్యకార్యముల నెవ్వరును లెక్కింపఁజాలరు. ఇది
యట్లుండ, నరణ్యమందు నెండ కెండుచు, వానకుఁ దడియుచు,
నిరాహారుఁడనై పెక్కేండ్లు ఘోరమైనతపస్సు జేసితిని. నేను
జేసినట్లు తపస్సు నేమునీశ్వరుఁడుగూడఁ జేసియుండఁడు"

గర్వముతోఁ గూడుకొన్న యయాతి పలుకులకు
దేవేంద్రుఁ డసహ్యమందెను. ఆతఁడు యయాతినిఁజూచి
"నృపాలా! నీవు చెప్పిన సత్కార్యము లన్నియు నీవు జేసి
యుందువు కాని యిట్లు ఆత్మస్తవముఁ జేసికొనుటమాత్రము
తగదు. ఆత్మస్తవమునేగర్వమందురు. గర్వముగలవారు స్వర్గ
మున నుండుటకర్హులుగారు"అనిపలికి, "గర్వముగలయీయ
యాతిని భూమింబడునట్లు ద్రోయియు"డని భటుల కాజ్ఞాపించెను.
యయాతి అట్లు పలికినందులకుఁ బశ్చాత్తాపమునంది యింద్రు
నితో "అమరనాథా! నాగర్వమే నన్నింతచేసినది. నా
యందు దయయుంచి, నేను భూమియందుఁ బుణ్యజనమధ్య
మున నుండునట్లు చేయుము," అని వినయముతోఁ బలికెను.
ఇంద్రునియాజ్ఞ ననుసరించి భటులు యయాతిని భూమింబడు
నట్లు ద్రోసివేసిరి. ఆతఁడు తనమనుమలు క్రతువుచేయుచున్న
స్థలమునఁ బడెను. యయాతి మనుమలు - తమపుణ్యములోఁ
గొంత, యాతని కిచ్చుటచే, నతఁడు మరలఁ గొన్నాళ్ళకు
స్వర్గమును బొందెను. చూచితిరా! గర్వమువలన యయాతి
కెట్టిస్థితి సంభవించినదో! ఎవ్వరును తాము గొప్పవారమని
గర్వింపరాదు.

# ౮. ఏకలవ్యుఁడు.

(గురుఁడే దైవము)

మున్ను హిరణ్యధన్వుఁడను నెఱుక రాజునకు ఏకలవ్యుఁడనుకొడు కుండెను. కురుపాండవుల కస్త్రగురుఁడైన ద్రోణాచార్యుని ప్రసిద్ధివిని, యాయేకలవ్యుఁ డాయనయొద్ద కేగి, భక్తివినయములతో నమస్కరించి మహాత్మా! నన్ను శిష్యునిగాఁ జేసికొని యస్త్రవిద్య గఱపుఁడని ప్రార్థించెను. ఏకలవ్యుని శూద్రునిగా నెఱింగి, ద్రోణాచార్యుఁడు వానికి ధనుర్విద్య నేర్పుట కంగీకరింపలేదు. ద్రోణుఁడు తన్ను శిష్యునిగా గ్రహించుట కంగీకరింపకపోయినను, ఏకలవ్యున కాతనియందు భక్తి తగ్గలేదు.

ఏకలవ్యుఁడు ద్రోణునిచే సెలవుఁబొంది యొకయరణ్యమునకుఁబోయెను. అతఁడచ్చోట మట్టితో - ద్రోణాచార్యుని రూపమును జేసి, దానినే గురువుగాఁ దలంచి, ప్రతిదినము దాని నతిభక్తితోఁ బూజించుచు, మిగులశ్రద్ధతో నస్త్రవిద్య నభ్యసించుకొనుచుండెను. కొంతకాలములో నాతఁడస్త్రవిద్యలోఁ బ్రవీణుఁడయ్యెను. ఇట్లుండ నొకనాడు - కురుపాండవులరణ్యమునకు వేటాడవచ్చిరి. అస్త్రవిద్యాభ్యాసముఁ జేసికొనుచున్న యేకలవ్యునిఁజూచి, రాజకుమారులతో వచ్చిన కుక్కయొకటి మొఱిగెను. ఏకలవ్యుఁడాకుక్క మొగంబున నైదుబాణములు విడిచెను. ఆబాణములు దూరముగానున్న కౌరవపాండవులముందుఁ బడెను. అంతట వారు బాణములు

వచ్చిన దారినేగి, యస్త్రవిద్యాభ్యాసము చేయుచున్న యేక లవ్యునిజూచి, వానిశరలాఘవమున కద్భుతమునంది వానిని "నీ వెవ్వఁడ" వని యడిగిరి. "నేను ఏకలవ్యుఁడనువాఁడ. హిరణ్యధన్వునిపుత్రుఁడ. ద్రోణాచార్యుని శిష్యుఁడ"నని యేక లవ్యుఁడు బదులుచెప్పెను. తరువాత నాకుమారులు నగరము నకు వచ్చిరి.

ఒకనాఁడు, అర్జునుఁడు ద్రోణునిం జేరి "ఆచార్యా! అస్త్ర విద్యయందు నన్ను గొప్పవానిగఁ జేయుదునని మీరు నాకుఁ జెప్పియుంటిరి. ఆమాట యబద్ధమయ్యెను గదా! ఇప్పుడు నాకంటెను మీకంటెను ధనుర్విద్యయందు గొప్పవాఁడొకఁ డున్నాఁడు. వానిపేరు ఏకలవ్యుఁడు. వాఁడు మీశిష్యుఁడట! మొన్న మే మడవికి వేటకుఁ బోయినప్పుడు చూచితిమి," అనిపలికెను. అంత నాద్రోణుఁడు ఏకలవ్యుని జూచుట కర్జు నుని వెంటఁబెట్టుకొనిపోయెను. ఏకలవ్యుఁడు ద్రోణుని పాద ములకు నమస్కరించి, "మహాత్మా! నేను మీశిష్యుఁడను. మిమ్ముఁ బూజించుచు నస్త్రవిద్య నేర్చుకొంటిని" అని నుడి వెను. ద్రోణుఁడు "ఏకలవ్యుఁడా! నీగురుభక్తికి మెచ్చితిని. నావలనఁగదా నీవస్త్రవిద్యం గఱచితివి. గురుదక్షిణ నీయ వలదా" యనెను. అందుల కామెఱుకురాజు "గురువర్యా! మీకోరిక యెట్టిదో తెలుపుఁడు. తప్పక యిచ్చెదను. నా కింతకన్నఁ గావలసినపుణ్య మేమియున్న" దని చెప్పెను. "కుడిచేయి బొటనవ్రేలిని గురుదక్షిణగా సమర్పింపు" మని ద్రోణుఁడడుగ, కొంచెమైనను సంశయింపక సంతోషముతోఁ

దన బొటనవ్రేలిని వెంటనే ఖండించి యాయేకలవ్యుఁడు గురువునకు సమర్పించెను.

## ౯. సువర్ణష్ఠీవి
( దురాశ దుఃఖకారణము )

పూర్వము సృంజయుఁడను రాజేంద్రుండు భగవంతుని గూర్చి, యతినిష్ఠతోఁ దపముఁ జేసెను-భగవంతుఁ డాతనికిఁ బ్రసన్నుఁడై "నీకేమికావలయు"నని యడిగెను. ధనమందు నతియాశ గల యానరపాలుఁడు దైవమునకు నమస్కరించి "నాకుఁ బ్రతిదినముబంగారమునిచ్చుకుమారు ననుగ్రహింపు" మనికోరెను. భగవంతుఁ డావరమును బ్రసాదించి యరిగెను.

అంతఁ గొన్నాళ్ళ కానరపాలున కొక కుమారుఁడు జనించెను-వానికి సువర్ణష్ఠీవి యనుపేరు పెట్టబడెను-ఆకుమారుని నోటినుండి వచ్చు పొంగయు, దేహమునుండి కారు చెమటయు, మలమూత్రములుగూడ బంగార మగుచుండెను. ఇట్లగుచుండుటచేత రాజునకు ధనమున కావంతయు లోపము లేదయ్యెను. సంపదయం దాతఁడు కుబేరుని మించియుండెను. ఆతనిమందిరములో నెక్కడఁ జూచినను హేమమే. ఇది యంతయుఁజూచి, రాష్ట్రములోనున్న ప్రతిముచుఁడును, సువర్ణష్ఠీవినిదనకు వశ్యునిగాఁ జేసికొనవలయునని ప్రయత్నింప సాగిరి. ఈ విషయము నృపాలుఁ డెఱిఁగి, కుమారుని మిగుల జాగ్రత్తగా గాపాడుచుండెను.

ఇట్లుండ నొకనాటి యర్ధరాత్రిసమయమున రాజమందిరమునందుఁ జోరులు ప్రవేశించి, నిద్రించుచున్న సువర్ణష్ఠీవి నెత్తుకొనిపోయి, యొకయరణ్యమునఁ బ్రవేశించిరి. ఆకుమారుఁడు నిద్రలోనుండఁగా నోటినుండి వచ్చినబొట్లును, దేహమునకుఁ బట్టిన చెమటయుఁ గొంతబంగారమయ్యెను. దానికి దొంగ లద్భుతమంది కడుపులో నెంతబంగారముండునోయని, దురాశచేఁ బీడింపఁబడినవారై, యాబాలునిఁ జంపి, పొట్టఁ జీల్చి చూచిరి. కడుపునం దేమియు బంగారములేదు. అంతకు ముందు వచ్చినబంగారమునుబంచుకొను విషయములో వారికి భాగములు కుదరక, వారిలో వారు కలహించి, కొట్టుకొని చచ్చిరి. దురాశమూలమున దొంగలిట్లయిరి.

మరునాఁ డుదయమున మందిరమున బాలుఁడులేకపోవుటచే, నాతనినెవ్వరో హరించినారని తలంచి యన్వేషించుచు నారాజేంద్రుఁ డరణ్యమునకు వచ్చెను. అక్కడఁ జచ్చిపడియున్న సువర్ణష్ఠీవి కనిపించెను. "దురాశచేత నేను భగవంతునిఁగోరి యుట్టి పుత్రునివడసి చంపితిని. దురాశచేతనే దొంగలు చచ్చిరి" యని శోకించి, యారాజేంద్రుఁడుగూడ గుండె పగిలి చచ్చెను.

---

## ౧౦. భగీరథుఁడు

### ( పట్టుదల )

పూర్వము ఇక్ష్వాకుకులమున సగరుఁ డనుసరపాలుఁడు గలఁడు. ఆతఁడు పెక్కు ద్రురాజులను జయించి, నిరంకు

శుఁడై, భూతలమును బాలించుచుండెను. అతనికి వైదర్భియు శైబ్యయు నను నిరువురు భార్యలు గలరు. సౌఖ్యసంపదల కావంతయుఁ గొఱంత లేదు. కాని, యాతనికి సంతానము మాత్రములేదు. అందుచే నాతఁడుపరమేశ్వరునిగూర్చి తపస్సు జేసెను. పరమేశ్వరుఁ డాతనికిఁ బ్రసన్నుఁడై వైదర్భియందు నఱువది వేవురు కొడుకులును, శైబ్యయం దొక్కఁడును జనింతురనియు, నఱువదివేవురు పుత్రులు నేకకాలమందే మరణింతురనియు, శైబ్యకుదయించిన కొమరుఁడే వంశకర్త యగుననియుఁ జెప్పెను. అంతఁగొన్నాళ్ళకు సగరుని భార్యలు గర్భముధరించి, పరమేశ్వరుఁడు చెప్పినట్లు కొడుకులఁగనిరి.

అట్లు జన్మించిన యఱువదివేవురుకుమారులును, క్రమక్రమముగా వర్ధిల్లి కడుదర్పిష్ఠులై లోకముల కెగ్గుసేయఁ బ్రారంభించిరి. శైబ్యయందు జనించిన యసమంజసుఁ డతిక్రూరుఁడై పౌరబాలకుల నకారణముగ వధించి నదిలోఁ గాఱవేయుచుండెను- సగరుఁడట్టి దుష్కృత్యముల సహింపఁజాలక యాకుమారుని విడిచిపెట్టెను. సగరసుతులగు నఱువది వేవురుకుమారులును పెట్టుబాధల కోర్వఁజాలక దేవతలు బ్రహ్మతో విన్నవించుకొనిరి సగరసుతులు త్వరలోనే దగ్ధులగుదురని బ్రహ్మ దేవతలకుఁ జెప్పెను.

ఇట్లుండ సగరుఁ డశ్వమేధయాగము సేయఁదలఁచి, దీక్షఁబూని, భూచక్రమెల్ల సంచరించివచ్చుటకు యజ్ఞాశ్వమును విడిచెను. దానికి రక్షకులుగా నఱువదివేవురు సుతు

లను బంపించెను. ఆయాగహయము ధరాచక్రమంతయుఁ జరించి, సముద్రతీరమును జేరి యదృశ్యమయ్యెను. సగరసుతులు దానిజాడ నెఱుంగక, యీసంగతి సగరున కెఱింగించి, యాతనియాజ్ఞపై మరలఁబోయి, వెదుక నారంభించిరి. అది భూలోకమున నెచ్చటను గన్పడలేదు. అంతట వారు భూమిం ద్రచ్చి, పాతాళమును బ్రవేశించిరి. అచ్చట కపిలమహాముని యాశ్రమ ముండెను. దానికి సమీపమున నొకవృక్షమునకు సగరుని యజ్ఞహయము కట్టఁబడియుండెను. సగరుని కుమారు లాహయమును జూచి, కపిలుఁడే దానిని హరించెనని తలఁచి, తపముఁజేసికొనుచున్న యామునీంద్రుని బెక్కువిధములఁ బరిభవించిరి. మునీంద్రుఁడు కోపదృష్టిం జూచినయంతనే యక్కుమారు లెల్లరును భస్మమైరి.

ఈవార్త నారదుఁడు సగరున కెఱిఁగించెను సగరుఁడు కుమారులమృతికి వగచి, పరమేశ్వరుని వాక్యములఁ దలఁచి ధైర్యమునవహించి, యసమంజసుని కొడుకగు నంశుమంతుని, యజ్ఞాశ్వముఁ గొని తెచ్చుటకు నియమించెను. అంశుమంతుఁడు తాతకు మ్రొక్కి బయలుదేరి, తనతండ్రులేర్పరచిన త్రోవను బట్టి పాతాళమున కేగి, కపిలమహామునిఁ గాంచి నమస్కరించి, భక్తివినయములు చూపుచుఁ దాను వచ్చిన కారణ మెఱిఁగించెను కపిలుఁ డంశుమంతుని భక్తివినయములకు సంతసించి, యశ్వమునిచ్చి "వత్సా! నీకారణమున నీతండ్రులు సద్గతికిఁ బోవుదురు. సగరున కుత్తమగతి దొఱకును. నీమనుమఁడు గంగను భూమికిఁ దెచ్చు"నని చెప్పెను. అంశు

మంతుఁడు కపిలుని ప్రసాదమంది, యజ్ఞాశ్వముతో వచ్చి యీవృత్తాంత మంతయు సగరున కెఱింగించెను. సగరుఁడు పుత్రశోకము విడిచి, యాగముఁబూర్తిజేసి, సముద్రునిఁ బుత్రునిఁగాఁ గల్పించుకొనెను - నాటినుండియు సముద్రము నకు సాగరమనుపేరు వచ్చెను.

సగరుఁడు పెక్కేండ్లు రాజ్యమేలి, యంశుమంతునకు రాజ్యమిచ్చితపమునకుఁబోయెను. అంశుమంతుఁడు పెక్కేండ్లు రాజ్యమేలి, తనసుతుండయిన దిలీపునకు రాజ్యమిచ్చెను. దిలీపుఁడు తనపితామహులగు సాగరులకు స్వర్గము కలిగించుటకు గంగను భూమికిఁదెచ్చుటకుఁ బ్రయత్నించెను గాని శక్తుఁడు గాకపోయెను. దిలీపుని పిదప భగీరథుఁడు రాజ్యమునకు వచ్చెను.

కపిలుని కోపాగ్నిచే సాగరులు దగ్ధులైరని విని వారికి మోక్షము గూర్పఁదలఁచి భగీరథుఁడు గంగనుభూమికిఁదెచ్చుటకు హిమాచలమునకుఁబోయి తపస్సు జేసెను. అతని తపమునకు మెచ్చి గంగాదేవి ప్రసన్నయై "నీ కేమికావలయు"నని యడిగెను. భగీరథుఁ డామె చరణములకు మ్రొక్కి "తల్లీ! కపిలునికోపాగ్నిచే నాతాతలు దగ్ధులైరి. వారిభస్మరాసులపై నీవు ప్రవహించితివేని వారు మోక్షమును బొందుదురు. కావున నీవు వసుంధరకు రావలయు'' నని పలికెను. అందులకు గంగ యాతనిం గాంచి "నేనుభూమికి వచ్చునప్పుడునా జలవేగము నెవ్వరునుభరింపఁజాలరు. అందులకొక్కశంభుఁడు శక్తుఁడగును. నీవాతని బ్రసన్నునిగాఁజేసికొను"మని చెప్పెను.

భగీరథుఁడు శివునిగూర్చి తపమొనర్చి మెప్పింప, నద్దేవుఁ డా తనిం గాంచి "నీవు గంగను భూమికిఁ దీసికొనిపొమ్ము. నే నామెను జటాజూటంబున ధరింతు," నని పలికెను. భగీరథుఁడు సంతసించి, మరల గంగాదేవినిస్తుతించి యామె యను గ్రహమును వడసెను. అంత నాగంగ మహావేగమున వచ్చు చుండఁ బరమేశ్వరుఁడు నిజజటాజూటంబునఁ దాల్చెను. అనంతర మాపావన వాహిని భగీరథునిచేభూమికిఁ గొనిపోవఁబడి, సముద్రమునఁగూడి సాగరుల భస్మరాసులపైఁ బ్రవహించి, వారికి సద్గతుల నిచ్చెను. భగీరథుఁడు భూమికిఁ దెచ్చుటచేతనే గంగకు భాగీరథియనునామము కలిగెను.

ఎట్టికార్యము సేయవలసివచ్చినను పట్టుదలయున్నచో జయము తప్పక గలుగును.

## ౧౧. ఉత్తరుఁడు

(డంబము పనికిరాదు)

శక్తిలేనిపనిఁ జేయుట కెవ్వరును సాహసింపరాదు. ముందు డంబము పలికి, తరువాతఁ గార్యము చేయలేనివానికి మిగుల నవమానము కలుగును. మత్స్యదేశాధీశ్వరుఁడైన విరటునకు ఉత్తరుఁ డనుకుమారుఁ డుండెను. ఆతఁడు బాల్యమందే క్షత్రియోచితములగు శస్త్రశస్త్రాదివిద్యలను నేర్చుకొనెను. ఆతఁ డెప్పుడును నెట్టిపనియైనను సులభముగాఁ జేయుదునని ప్రగల్భములాడు నలవాటు కలవాఁడు. ఇట్లుండ

నొకనాడు కౌరవులు వచ్చి విరటునిగోగణమును బట్టుకొనిరి. గోపాలకులు వచ్చి యావృత్తాంతమును రాజున కెఱింగించిరి. కౌరవులలో గొప్పయోధు లుండుటచే, నెట్లు వారి నెదిరింతుమాయని విరటుఁడాలోచించుచుండెను. అప్పుడు ఉత్తరుఁడు తండ్రిని విలోకించి "నాయనా! కౌరవులు మనగోగణంబును బట్టిరని నీవు సందేహింప నక్కఱలేదు. నాకుఁదగిన సారథియుండునేని, యాకౌరవులను గెల్చి, క్షణములో మన గోవులను మరలించుకొని వచ్చెద" నని పలికెను.

అంతకు మున్న పాండవులు మాఱువేషములతో విరటునిఁగొల్చుచుండిరి. అర్జునుఁడు బృహన్నలయను పేరుతో నుండెను. అతఁడు సారథ్యమునందుఁ బ్రవీణుఁడని వాడుకయుండెను. అందుచేత బృహన్నలను సారథిగాఁ జేసికొని, యుత్తరుఁడు కౌరవులమీఁదకుఁ బోయెను. బృహన్నలయే యర్జునుఁడని యుత్తరునకుఁ దెలియదు. ఉత్తరుఁడు రథము నెక్కి బృహన్నలను జూచి "బృహన్నలా! రథము త్వరగాఁ బోనిమ్ము. కౌరవులు నన్నుఁజూచి, యర్జునుండని, భ్రమించునట్లు యుద్ధము జేసి గోవులను మరలించుకొని వచ్చెదను," అని పలికెను. ఈ డంబపుఁ బలుకులకు నర్జునుఁడు నవ్వుచు రథము నడిపెను.

రథము కౌరవులున్న తావునకుఁబోయెను ఉత్తరునకుఁ గౌరవులఁ జూచినంతనే శరీరము వడఁకెను. ఆతఁ డర్జునుని జూచి యిట్లుపలికెను. బృహన్నలా! రథము వెనుకకుఁ బోనిమ్ము కౌరవబలమును నేను చూడలేను–నాకు మిగుల భయము గలుగుచున్నది. భీష్ముఁడు, ద్రోణుఁడు మొదలయిన వీరు

లను దాఁటుటకు నాకు శక్తిచాలదు. బ్రతికియున్నచో సౌఖ్యములు కలుగును. నన్ను వీరియెదుటఁ బడవేయక రథమును మరలించి నాప్రాణముల రక్షింపుము.

ఉత్తరుని మాటలకు బృహన్నలకు నవ్వువచ్చెను. ఆతఁడు రాజకుమారునిఁ జూచి "ఉత్తరా! కౌరవులను గెల్చి గోవులను మరలించుకొని వచ్చెదనని మీతండ్రికిఁ జెప్పియుంటివి. ఇప్పుడు భయము నందుచుంటి వేమి? గోవులను మరలించుకొనకుండఁ బురమునకుఁ బోవుదుమేని యందఱును మనలను గేలిసేయరా! భయము విడిచి శత్రువులతోఁ బోరుము. గోవులను మరలింపుము కీర్తిఁ బొందు" మని వచించెను. ఎంతచెప్పినను ఉత్తరుఁడు తనభయమును విడువలేదు. బృహన్నల యాతనిని మఱింత బలవంతపెట్టెను. అప్పుడుత్తరుఁడు శత్రువులు చూచి నవ్వునట్లు రథముదిగి పరుగెత్తసాగెను. బృహన్నల యాతనిం బట్టుకొని తీసికొనివచ్చి రథముపైఁ గూర్చుండఁబెట్టి తాను అర్జునుఁడగుట నెఱింగించెను. ఆపలుకులు వినఁగనే యుత్తరున కొకవిధమయిన సంతోషము కలిగెను. కొంచెము ధైర్య మొదవెను. అప్పుడర్జునుఁ డుత్తరుని సారథిగాఁ జేసికొని, కౌరవులతోఁ బోరాడి గెలిచి, విరటుని గోగణమును మరలించుకొనిపోయెను.

## ౧౨. వృకాసురుఁడు

(దుర్మార్గులకు మేలు సేయరాదు.)

వృకుఁ డనుదానవుఁడు పరమేశ్వరునిగూర్చి ఘోరమైన తపస్సుఁజేసెను. అతఁ డొనర్చిన కఠినతపమునకు సంత

సించి శంకరుఁ డాతనికి, ప్రత్యక్షమై "వృకాసురా! దానవుఁడ వయ్యును ఘోరతపంబున నన్ను మెప్పించితివి. నీ కెట్టివరములు కావలయునో కోరుకొనుము ఇచ్చెద"నని పలికెను. వృకుఁడు పరమేశ్వరుని పాదకమలములకు మ్రొక్కి- "మహానుభావా! ఆర్తులను రక్షింపఁ గంకణము ధరించిన నీవు నాయెడలఁ గరుణఁబూని దర్శనమిచ్చితివి. నాభాగ్యము సామాన్యమైనది కాదు. అనేక మునీంద్రులు నీకృపను బడసి ధన్యులైరి. నీయనుగ్రహము వడయఁదలఁచి యిట్టి తపం బొనర్చితిని. నాయెడలఁగృపాంతరంగుఁడవైన నే నెవ్వనిశిరముపై హస్తముఁబెట్టుదునో వాఁడు భస్మమగునట్లు వరమని"మ్మని పలికెను. అట్టివరము నిచ్చుటవలనఁ, దనకుఁగాని జగమునకుఁగాని యేవిధమయిన హాని యొదవునో యని పరమేశ్వరుఁడు యోచించలేదు. దైత్యుఁ డడిగినయంతనే శివుఁడు వాని కావరమిచ్చి, యరుగుచుండెను. వృకాసురుఁడు పరుగెత్తుకొనిపోయి, యీశ్వరుని నిలిపి, "శంకరా! నీ విచ్చినవరము నందు సత్యమును బరిశీలిఁపవలయును. కావున ముందు నీశిరముపై హస్తముఁ బెట్టిచూచెద"నని పలికి, యట్లుఁ చేయఁ బోయెను. దుష్టున కట్టివర మిచ్చుటచేతఁ గలిగినఫల మిది కదా యని పరమేశ్వరుఁడు పరుగెత్తసాగెను- వృకుఁ డాతనిని విడువక వెన్నంటెను. ఇరువురును గడుదూరము పరుగెత్తిరి.

ఈవిధ మంతయు శ్రీహరి తనదివ్యజ్ఞానమున నెఱింగి, పరమేశ్వరుని రక్షింపఁ దలఁచి భువనమోహినీరూపముఁ

దాల్చి, శంకరునికై పరుగెత్తుకొని పోవుచున్న వృకాసురుని యెదుట నిలిచెను. దైత్యుఁ డాకపటకాంతాకృతిం జూచి నిలువఁబడెను. వానిదృష్టియంతయు నా స్త్రీరూపముమీదనే యుండెను. శ్రీమన్నారాయణుఁ డాదైత్యుని గీ్రగంటి చూపులఁ జూచుచు 'ఎక్కడి కింతతొందరగాఁ బోవుచుంటి'వని యడిగెను-వృకుఁడు తనసంగతిఁ జెప్పెను. అప్పుడు శ్రీహరి వాని కిట్లనిచెప్పెను 'దానవా! నీవీరీతి శంకరునిబట్టుకొనుటకై పరుగెత్తినందువలన లాభము లేదు. నేను చెప్పినట్లు చేసితివేని యాతఁడు నీకుఁజిక్కును. ఇక్కడకు సమీపమున నొక తటాక మున్నది. నీ వందు స్నానముచేసి, శుభ్రముగాఁ దలఁదుడిచికొని, యాతనిశిరముపైఁ జేయిపెట్టుము. అట్లొనర్చితివేని నీవు ఫలమును బొందఁగలవు.

హరి చెప్పినట్లుచేయుటకు వృకుండు సమ్మతించెను. ఇరువురును నాసమీపమున నున్న సరోవరముకడకుఁబోయిరి. వృకుఁడు హరివాక్యములు నమ్మి తటాకములో దిగి స్నానము చేసి, తుడిచికొనుటకు శిరముపైఁ జేయివైచికొనెను. వెంటనే యాతఁడు భస్మమయ్యెను.

పరమేశ్వరుఁడు పరుగెత్తుకొనిపోయెననుమాటయేగాని యాప్రాంతమునందేయుండి యిది యంతయుఁ జూచుచుండెను. వృకుఁడు భస్మమైనవెంటనే శివుఁడు శ్రీహరిం జేరి "నేడు నీదయవలన బ్రదికితి"నని పలికెను. శ్రీహరి యాతనింగాంచి "దుష్టుల కెప్పుడును మేలుసేయరా"దని పలికి, నిజలోకము నకుఁబోయెను.

## ౧౩. అంబరీషుఁడు

( కోపముచే నెట్టివారైనను గీడుఁ బొందుదురు. )

తొల్లి సూర్యవంశమున నంబరీషుఁ డనునొకనృపాలు డుండెను. ఆతఁడు ధర్మపద్ధతిని రాజ్యమేలుచు భక్తితత్పరుఁడై యుండెను. ఆతఁడు శ్రీహరిభక్తుఁడగుటచే నేకాదశీవ్రతమును జేసి, ద్వాదశి ననేక బ్రాహ్మణులకు భోజనముపెట్టి తాను పారణముచేయుచుండుట యాచారమైయున్నది. ఎన్నియంతరాయములు కలిగినను ఆతఁ డానియమమును మాత్రము విడువక యుండెను. ఇట్లుండ నొకద్వాదశీదినంబున దుర్వాసమునీంద్రుఁ డాతనికడకువచ్చెను. దుర్వాసుఁడన్న సామాన్యమునీంద్రుఁడు గాఁడు; మహాకోపస్వభావుఁడు, రాజు దుర్వాసుని బహువిధములఁబూజించి, "మహాత్మా! నేఁడు నాపుణ్యమున నన్నుఁగృతార్థునిఁ జేయుటకు వచ్చితిరి. నేఁడు ద్వాదశియగుటచేఁ బెక్కండ్రు భూసురులు వచ్చినారు. పారణ సేయుటకు సిద్ధముగానున్నారు నీవు సత్వరముగ స్నానముచేసి దయసేయు" మని వినయముతోఁ బలికెను. దుర్వాసుఁడు స్నానమునకై నది కరిగెను- ఎంతసేపటికిని నమ్మునీంద్రుఁడు రాకపోవుటచే నంబరీషుఁడు బ్రాహ్మణులను జూచి "స్నానమున కరిగిన మునీంద్రుఁడింకను రాలేదు. ద్వాదశిగడియలు దాటినతరువాతఁ బారణముచేసి నందువలన నేమి ప్రయోజనముండును? మునీంద్రుఁడురాకుండ మనము భుజించినచోఁ బాపము సంభవించును. ఇందులకు మార్గమేమి" యని పలికెను. అందులకు ధర్మవేత్తలగు బ్రాహ్మణు లాతనిఁ జూచి "రాజా! భగవంతుని కర్పించిన

తీర్థమును సకాలమునఁ బుచ్చుకొన్నచో ద్వాదశిపారణఁ జేసినఫల మొనఁగూడును. అతిథి రాకుండ భుజించినదోషము గూడ నుండదు," అని చెప్పిరి. అంతట నంబరీషుడు భగవత్పాదాభిషేకతీర్థమును బుచ్చుకొనెను.

అనంతరము దుర్వాసుఁడువచ్చి యంబరీషుఁడుచేసినపని గ్రహించి, తోకఁద్రొక్కినత్రాచువలె మండిపడుచు, మంత్రప్రభావమున నొకశక్తినిబుట్టించి యంబరీషునిపై విడిచెను. అంబరీషుఁ డాశక్తినిజూచి మిగుల భయమంది, తన్ను రక్షింపుమని శ్రీమన్నారాయణునిఁ బ్రార్థించెను. భక్తరక్షకుఁడైన శ్రీహరి, తననిజభక్తుఁడగు నంబరీషుని రక్షించుటకుఁ దన చక్రమును బంపెను. ఆచక్రము మహాగ్నిజ్వాలలఁ గ్రక్కుచు వచ్చి, దుర్వాసుని శక్తిని భస్మముఁజేసి, దుర్వాసునిపైకి బోయెను. దుర్వాసుఁడు ప్రాణభయమున బ్రహ్మకడకును, శివునికడకునుబోయి రక్షింపుఁడని వేడుకొనెను. "శ్రీహరిచే విడువఁబడిన యీచక్రము నెవ్వరును వారింపఁజాలము. శ్రీమన్నారాయణునే వేడుకొను" మనివారుపలికిరి. దుర్వాసుఁడు శ్రీహరినిఁజేరి రక్షింపుమని వేడెను. అతఁడు "దుర్వాసా! నీవంబరీషునే శరణుఁబొందు," మనెను. అంతట దుర్వాసుఁడు వేఱొకమార్గము లేక, అంబరీషుని జేరి, "నృపాలా! నీపైన నకారణకోపముఁబూనియపరాధముజేసితిని. ఈచక్రము నుండి నన్నురక్షింపు" మని పలికెను. అంబరీషుఁడు చక్రము శాంతిఁబొందుటకు శ్రీహరిని స్తుతించి, దుర్వాసుని ప్రాణభయముఁ బాపి, యాతనినిఁ బూజించిపంపెను.

# ౧౪. అభాగుఁడు

( నిష్పక్షపాతబుద్ధి )

దృష్టుఁడను రాజునకు అభాగుఁడు అనుకుమారుఁ డుం డెను. సకలవిద్యలను నేర్చిన యాభాగుఁ డొకనా డొక వైశ్య కన్యనుగాంచి, సౌందర్యమున కద్భుతమునంది, యామెను దన కిచ్చి పెండ్లిసేయుమని యామెతండ్రి నడిగెను ఇట్లు సేయుట ధర్మశాస్త్రపద్ధతి కాదని వైశ్యుఁడు పలికెను. అ భాగుఁ డందుల కాగ్రహమంది ,,నీవు నీపుత్రికను నాకొసంగ వేని, నేనే బలవంతముగాఁ దీసికొనిపోయెదను? నన్నెవ్వరు వారింపగలరు?" అని నుడివెను. వైశ్యుఁడు భయమంది దృష్టునిఁజేరి, యీసంగతిఁ దెలిపెను. దృష్టుఁడు కుమారునిఁ బట్టి తెప్పించి, కుమారుఁడవియైనఁ దలఁపక నిష్పక్షపాతబుద్ధి తో వానిని దండించెను.

దృష్టుఁ డాభాగునకు రాజ్యమిచ్చి తపమునకుఁ బోయె ను. అభాగుఁడు న్యాయవర్తనుఁడై చిరకాలము రాజ్యము పాలించెను. అతనికి బెక్కండ్రు కొడుకు లుండిరి. కొడుకు లకు రాజ్యమిచ్చి యాభాగుఁడు తపోవృత్తిని బ్రవేశించెను. కొన్నాళ్ళ కాయాభాగుని కుమారు లందఱును కడగొట్టు వానితో, "నీకు రాజ్యభాగములేదు. కావున నరణ్యమునఁ దపముఁజేసికొనుచున్న తండ్రియొద్దకుఁ బొ"మ్మనిరి. అగ్రజుల మాటల కేమియు బదులుచెప్పక అతఁడు తిన్నగా నాభాగుని జేరి తన్ను సోదరులు చేసినవిధమంతయుఁ దెలిపెను.

అందుల కాభాగుఁడు కుమారునిఁ జూచి "కుమారా! ఈ విషయములో నీవు కలహము గలుగఁజేసికొనుట మంచిది కాదు. ఇప్పుడు నైమిశారణ్యమునఁ దాపసులు గొప్పయాగమును జేయుచున్నారు. నీవచ్చటి కేగి పాపపరిహార మంత్రములను జదువుము మునీంద్రులు మెచ్చి, యాగము సేయఁగా మిగిలినధనమును నీకిచ్చెదరు. దానిచే నీవు ధనవంతుఁడ వగుదువు," అని చెప్పెను. తండ్రియాజ్ఞ ననుసరించి, యాకొమరుఁడు—మునీంద్రులు యజ్ఞముసేయుచున్న ప్రదేశమున కేగి మంత్రములను జదువగాఁ దాపసులు క్రతుశేషద్రవ్యము నాతని కిచ్చిరి. ఆకుమారుఁ డాద్రవ్యమును బుచ్చుకొని వచ్చుచుండఁగా రుద్రుఁడు వచ్చి "ఇది నాద్రవ్య" మని పలికి యడ్డగించెను. "క్రతుశేష మైనధనమును దాపసులు నాకీయఁగాఁ దెచ్చుకొనుచున్నాడ"నని చెప్పుచు నాకుమారుఁడు ఆభాగునియొద్దకు వచ్చెను. అచ్చటికి రుద్రుఁడుగూడ వచ్చి యభాగుని విలోకించి "నీకుమారుఁడు – నాకు రావలసిన ధనమును దెచ్చుకొన్నాడు," అని నుడివెను. యజ్ఞ శేషము రుద్రునకే చెందవలయును గావున నాధనమంతయు నాతనికే యిమ్మని యాభాగుఁడు కొమరునకుఁ దెలిపెను. రుద్రుఁ డాభాగుని నిష్పక్షపాతబుద్ధికి సంతసించి, ధనమంతయు నాతని పుత్రునే గైకొనుమనిచెప్పి యరిగెను.

# ౧౫. ధర్మరాజు

( సర్వభూతదయ )

మానవులయందు మన మెట్టిప్రేమ జూపుచుందుమో అట్టిప్రేమనే సమస్తజీవరాసులయందుఁగూడఁ జూపవలయును. అట్లుచూపుటయే సర్వభూతదయ యందురు. పూర్వము ధర్మరాజు యుద్ధములోఁ గౌరవులను గెలిచి, హస్తినాపురమునకు బట్టాభిషిక్తుఁడై కొన్నిసంవత్సరములు రాజ్యముఁ బాలించి, మనుమఁడగు పరీక్షితునకుఁ బట్టముఁగట్టి, తమ్ములతోడను ద్రౌపదితోడను స్వర్గమునకుఁబోవుటకు బయలుదేరెను. దారిలో నాతనితమ్ములును, ద్రౌపదియు మృతిఁజెందిరి. ధర్మరాజొక్కఁడే పోవుచుండెను.

ధర్మరాజు నగరము విడచినప్పటినుండియు నాతని వెంట నొకశునకము వచ్చుచుండెను. ధర్మరాజు చనిచని స్వర్గమును సమీపించెను. అప్పు డింద్రుఁ డాతని కెదురుగా వచ్చి, రమ్మని పిలిచెను. ధర్మజుఁడు స్వర్గములోఁ బ్రవేశించుచుండఁగా వెంటనున్న శునకముగూడ నాతనితోఁ బ్రవేశింపఁ బోయెను. అప్పు డింద్రుఁడు దానిని వారించెను. ధర్మరాజు మహేంద్రునిఁజూచి నా వెంటఁ బురమునుండి యీశునకము వచ్చుచున్నది. కావున దీనింగూడ రానిమ్మనెను. "రాజేంద్రా! పుణ్యముఁజేసికొన్నవారలే స్వర్గముఁ బ్రవేశించుట కర్హులు. సారమేయము స్వర్గములోనికి వచ్చుటెట్లు," అని పలికెను. అందులకు ధర్మరా జిట్లు బదులు చెప్పెను. 'దేవా ఎంతశ్రమపడి నాతోవచ్చిన దీనిని విడుచుటకునాచిత్తము

సమ్మతింపదు. ఇది లేకుండ నేను స్వర్గముం బ్రవేశింపను. నా యందుఁ గరుణయున్నచో దీనినిగూడ రానిమ్ము. లేదేని నేను మరలి పోయెదను."

ధర్మరాజునిపలుకులు విని, వెంటనున్న శునకము యముఁడై నిలిచి "రాజేంద్రా! నీసర్వభూతదయకు మిగుల సంతోషించితిని. నీచిత్తముఁ బరీక్షించుటకు నేను యిట్టిరూపమున వచ్చితి"నని పలికి, యాతనిని స్వర్గమునకుఁ దీసికొనిపోయెను.

## ౧౬. వసువులు

(దొంగతనము పనికిరాదు.)

వసిష్ఠుఁ డనునొకమహాఋషి యుండెను. ఆతఁడు తపమువలన గొప్పమహిమ సంపాదించి, బ్రహ్మఋషియయ్యెను. ఆతనియొద్ద "నందిని" యను పేరుగల కామధేను వుండెను. ఆమునీంద్రుఁడు తనయాశ్రమమున కెంతమంది యతిథులు వచ్చినను, కోరినప్రతివస్తువును గామధేనువు సమకూర్చుచుండుటచే విందులజేయుచుండెను. ఒకనాడు 'వసువులు' అను దేవతలు తమభార్యలతో వసిష్ఠుని యాశ్రమసమీపమునకు విహారమునకు వచ్చిరి. వసువులరాక వసిష్ఠుడు చూచి, వారి నందఱిని దనయాశ్రమమున విందుగుడిచి పొమ్మని సంతోషముతోఁ బలికెను. వసువులు సమ్మతించి విందుఁగుడిచి పోయిరి.

కామధేనువుమహిమకు వసువులు మిగుల నద్భుతమందిరి. అందులోఁ జిన్నవానిభార్య మగనింజూచి "మన కెంత భాగ్యమున్న నేమిలాభము! ఒక కామధేనువైనను కేలలేకుండ. వసి

ష్ఠుఁడు మనకు విందుఁజేసినాఁడు. ఇందులకుఁ గారణము కామధేనువేకదా? మన కయ్యదియున్నఁ జాలదా? నాకామ ధేనువుమీఁద మిగులఁగోరిక యున్నది. కావున నెట్లయిన దానిందెచ్చినాముద్దు చెల్లింపు"మని పలికెను. "స్త్రీయగుటచే నిట్లుగోరెను; కామధేనువును దెచ్చుటచే నేమిహాని యొదవునో" యని యావసు వాలోచించలేదు. భార్య యడిగినదే తడవుగఁబోయియాకామధేనువును దొంగిలించుకొనివచ్చెను. తక్కినవసువు లాతని కిది ధర్మముకాదని చెప్పలేదు.

వసువు కామధేనువును దొంగిలించుకొనివచ్చుట వసిష్ఠమహాముని గ్రహించెను. ఆతనికపరిమితమైనయాగ్రహము వచ్చెను. ఆతఁడు వసువులంజేరి "మీరు మంచివారనితలంచి విందుజేసితిని. అందుకు ఫలముగా నాకామధేనువును దీసికొని పోవుచుండిరి. 'తిన్న యింటివాసముల నెన్నుట' యన్న నిట్టిదే. అధర్మకార్యము చేసినందులకు మీకుఁ దగినశిక్ష యుండవలయును. మీరు భూలోకమున నరులై పుట్టుదురు గాక" యని శాపమిచ్చెను. శాపమునకు భయపడి వారందఱును, "అవివేకముచేత మే మీపనిచేసితిమి. భూలోకములో మేము పెద్దకాల ముండకుండునట్లురక్షింపు"మని వసిష్ఠునిపాదములపైఁబడి వేడుకొనిరి. వసిష్ఠుఁడు దయఁబూని "కామధేనువును హరించిన వసువుతప్పఁదక్కినవారు పుట్టఁగనే మరణింతురు. అతఁడుమాత్రము భూమిపైఁ బెద్దకాల ముండు"నని వచించెను.

# ౧౭. కర్ణుఁడు

## కృతజ్ఞత

కర్ణుఁడు కుంతీదేవికి సూర్యునివరమున వివాహమునకుఁ బూర్వమే జనించి, చిత్రరథుఁడను సూతునిచేఁ బెంపఁబడెను. ఈతఁడు పరశురామునియొద్ద నస్త్రవిద్య నభ్యసించి, హాస్తినాపురాధీశ్వరుఁడైన దుర్యోధనునకుఁ బ్రాణసఖుఁడై యుండెను. దుర్యోధనుఁ డీతని నమ్ముకొనియే పాండవులతో యుద్ధము సేయఁ దలపెట్టినాఁడు. ఈతఁడే యర్జునుని దునుమాడఁగల వీరుఁడని యారాజేంద్రుఁడు నమ్మియుండెను. కృష్ణుఁడు పాండవదూతయై కౌరవసభకు వచ్చినప్పుడు - ఎట్లయినఁ గర్ణుని బాండవపక్షమునకుఁ ద్రిప్పఁదలఁచి రహస్యముగా నతనితో నిట్లు పలికెను.

"కర్ణా! నీజన్మమునుగూర్చి యించుక చెప్పవలయును. నీవు సూర్యునివరమునఁ గుంతికిఁ బుట్టి రాధాచిత్రరథులచేఁ బెంపఁబడినాఁడవు. కాని, నీవు నిజముగా సూతుఁడవుకావు. నీవు పాండవేయుఁడవే. ఈసంగతి తెలియక సుయోధనుని గొలుచుచుంటివి. ఇప్పుడైనను నామాటలు విని పాండవులఁ జేరుము. భూతలమంతయు నీచేత నేలించెదను. ధర్మరాజు నలువురు తమ్ములతో నిన్ను సేవించును. ఇదియుఁగాక ద్రౌపది నిన్నాఱవభర్తగఁ గైకొనును."

కృష్ణునిపలుకులకు స్వామిభక్తిగల కర్ణుఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "కృష్ణా! నీవు నాయందుఁ జూపినదయకు సంతోషించితిని. లోకములో నీకుఁ దెలియనిధర్మములు లేవు. భగవంతుఁడు నన్నేకార్యము చేయుటకుఁ బుట్టించెనో

దానిని జేయుటయే నామతము. చంచలమైన భాగ్యమున కాసించి నేను శాశ్వతయశమును గోలుపోవువాఁడను గాను. నాకీర్తికిని, శౌర్యప్రతాపములకును దుర్యోధనుఁడే కారణము. ఇంతవఱకు నే నాతని యుప్పుఁబులుసుఁ దిని జీవించుచుంటిని. ఇప్పుడు నేనాతనిని విడనాడితినేని జను లందఱును న న్నతినీచదృష్టితోఁ జూతురు. నేను ఘోరనరకమునఁ బడుదును. నీచమైన సౌఖ్యముల కాసించి నే నధర్మమునఁ బ్రవేశింపను. నా ప్రాణము లున్నంతవఱకు దుర్యోధనుని పక్షమున నిలిచి పోరాడెదను. అతనికై నా ప్రాణములయినను నర్పించెదను.

కురునాథుని యందుఁ గర్ణున కున్న కృతజ్ఞతకు సంతసించి, కృష్ణుఁడు "కర్ణా! నీచిత్త మరయుట కిట్లడిగితిని. నీవు నిజమైన రాజభక్తుఁడవు. నీకీర్తిలతలు సకలదిక్కులఁ బ్రాకుఁ గాక" యని పలికెను. కర్ణుఁడు భారతయుద్ధమున దుర్యోధనునిపక్షమున నిలిచి, భయంకరముగాఁ బోరాడి – వీరస్వర్గమలంకరించెను.

## ౧౭. పావురములు - మూషికము.

( ఆపద కడ్డుపడువాఁడే నిజమైన హితుఁడు )

ఒకనాఁ డొకవేటకాఁడు అరణ్యమునకుఁబోయి యొకచోటఁ గొన్నివడ్లను జల్లి, పక్షులను బట్టుటకు వలఁబఱచెను. కొంతసేపటి కాప్రదేశమునకుఁ గొన్నిపావురములు వచ్చి యావడ్లను జూచి తమకు మంచియాహారము దొరికెనని సంతోషించుచు వానిం దినఁదలంచెను. అప్పు డందున్న యొక

వృద్ధకపోతము తక్కినవానిం జూచి "ఈవడ్లను జూచి మీరు మిగుల సంతోషించుచున్నారు. నాకిది మాయగాఁగనఁబడు చున్నది. చుట్టుపట్ల నెక్కడను వడ్లులేవు. ఇచ్చట మాత్రమే యున్నవి. దీనివలన మనకేమయినహాని కలుగునేమోయని సంశయమగుచున్నది. కావున మన మాతెరువునకుఁబోవల" దని చెప్పెను. ముసలిపావురము మాటలను లెక్కసేయక పావురము లన్నియు వడ్లను దినుటకుఁబోయి వలయందుఁ జిక్కుకొనెను.

పావురములు తమ కట్టిగతి సంభవించినందులకుఁ జింతింపసాగెను. వాని కావలఁబడుమార్గ మేమియు లేదు. ఇఁకఁ గొంచెముసేపులో వేటకాఁడువచ్చి వాని నన్నిటిని జంపును. అప్పుడు వృద్ధకపోతము "మన మిట్లు చింతించుచున్నందువలన లాభము లేదు. వేటకాఁడు వచ్చి మనలను జంపును. ఎట్లయినను మనము ప్రాణములను రక్షించుకొనవలయును. కావున మన మందఱమును గలసి, వలతోఁగూడ నెగిరిపోదము. ముందు మన మీప్రదేశము దాటి మఱియొక తావునకుఁజేరి యాలోచించుకొందము" అని చెప్పెను.ఆయు పాయము బాగుగ నున్నదని తలంచి, వెంటనే యాపావురములు వలతోఁగూడఁ బై కెగిరిపోయెను. "పావురములు చిక్కినవి" అని సంతోషించుచు వానిం బట్టుకొనుటకు రాఁదలంచి చెట్టుచాటుననున్న వేటకాడు పావురములు వలతోఁగూడ నెగిరిపోయి తన్ను మోసపుచ్చినందులకు మిక్కిలి విచారించెను.

వలతోఁగూడ నెగిరిపోయిన పావురము లోకప్రదేశ
మున నిలిచి వలనుండి యీవలఁ బడునుపాయ మాలోచించు
చుండెను. అప్పుడు పావురములఱేఁడు వానిం గాంచి "మిత్రు
లారా! నాకొకమూషికరాజు స్నేహితుఁడై యున్నాఁడు.
అతని నివాస మిచ్చటికి సమీపమునందేయున్నది, మనమచ్చ
టికిఁబోవుదుమేని యాతఁడు తప్పక మనలను రక్షింపగలఁడు"
అని పలికెను. అందులకుఁ గపోతములన్నియు సమ్మతించెను.
పావురములు మరల వలతో నెగిరి, మూషికమున్న తావునకుఁ
జేరెను. తనకు మిత్రుఁడయిన కపోతరాజు వచ్చుటఁజూచి
మూషికము తనకలుగునుండి యీవలకు వచ్చి యాతనిని
జూచి "సఖుఁడా! నీరాక నాకెంతయు సంతోషము కలిగిం
చెను. కాని నీస్థితిఁజూడ విచారమగుచున్నది. కానిమ్ము నీవు
భయమందవలదు. వలత్రాడు గొఱికి నిన్ను రక్షించెదను"
అని పలికెను. అప్పుడు పావురములపెద్ద మూషికమును గాంచి
"స్నేహితుఁడా! నాయందున్న ప్రేమచే నీవు నన్ను రక్షిం
చెద ననిపలికితివి, సంతోషమే. కాని, నేనొక్కఁడ నీవల
బడినందువలన లాభ మేమియున్నది. నావారందఱును నీవల
యందుఁ జిక్కుకొన్నారు. వీరందఱికన్న నాప్రాణ మెక్కువ
కాదు. ముందు వీరిని రక్షించి పిదప నన్ను రక్షింపుము. తన
పరిజనులసౌఖ్యముఁ జూడనివాఁడు రాజు గాఁడు. కావున నా
యందుఁగృపవహింపు"మని చెప్పెను. పావురములపెద్దగుణము
నకు మూషికరాజు సంతోషించి నెమ్మదిగా నావలత్రాడు
లన్నియుఁగొఱికివేసి పావురములను రక్షించెను. అప్పుడుపావు
రములఱేఁడు ఎలుకను జూచి "హితుఁడా! నీదయావలన నేఁడు

నేనును నావారును బ్రతికితిమి. నీఋణము మే మీజన్మమునఁ దీర్చుకొనఁజాల"మని పలికి తనవారితో నచ్చటనుండి వెడలి పోయెను.

## ౧౯. శుక్రాచార్యుఁడు

( మద్యపానము పనికిరాదు.)

శుక్రాచార్యుఁడు దైత్యులకు గురుఁడై యుండెను. ఆతనియొద్ద మృతసంజీవని యనునొకగొప్పవిద్య యుండెను. దానిమహిమచే నతఁడు - యుద్ధములలోఁ జచ్చినదానవుల నెల్లర బ్రతికించుచుండెను ఈవిద్య యమరులలో లేదు. అందుచేత వారావిద్య నెట్లయిన గ్రహింపఁదలంచియుండిరి. సాధారణముగా శుక్రుఁ డావిద్య నెవ్వరికిని ననుగ్రహింపఁడు. దేవత లిది యంతయు నాలోచించి, బృహస్పతిపుత్రుఁడయిన కచుఁ డనువానిని - ఆవిద్యనెట్లయిన శుక్రునియొద్ద గ్రహించి వచ్చుటకుఁ బంపిరి.

కచుఁడు శుక్రాచార్యుని సన్నిధికిఁబోయి నమస్కరించి "ఆచార్యా! నేను బృహస్పతి పుత్రుఁడను. నీయొద్ద విద్యలఁ గఱచుటకు వచ్చితిని. నన్ను శిష్యునిగా గ్రహించి కృతార్థునిఁజేయుఁడని పలికెను. దేవతాగురుఁడైనబృహస్పతి పుత్రుఁడు తనకడ విద్యనభ్యసించుటకు వచ్చెనని సంతసించి, శుక్రాచార్యుఁడు కచుని శిష్యునిగాఁ జేసికొనెను.

కచుఁడు శుక్రునకు భక్తితో సేవలుచేయుచు విద్యల నేర్చుకొనుచుండెను. శుక్రాచార్యుని కొకకూఁతురు కలదు.

ఆమె పేరు దేవయాని. ఆమె కచునియం దెంతయో యనురా
గము గలిగియుండెను. కచుఁడు నిర్మలమైనమనస్సుతో నామె
చెప్పిన పనులను శిరసావహించి చేయుచుండెను. కానియామె
చిత్త మాతనిపైఁ జిక్కియుండుట గ్రహింపలేదు. గురుపుత్రి
యగునామె నాతఁడు తల్లివలె భావించి మెలంగుచుండెను.

కచుఁడు మృతసంజీవనివిద్య గ్రహించుటకే శుక్రుని
యొద్దఁ జేరెనని రాక్షసులు గ్రహించి, యెట్లయినఁ గచుని
జంపుటకు వారు ప్రయత్నించుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు
కచుఁడు ధేనువులఁ దోలుకొని యరణ్యమునకుఁ బోయెను.
దానవు లరణ్యమునఁ గచుని జంపి, కళేబరమును గాల్చి
యాభస్మమును సురలోఁ గలిపి, శుక్రాచార్యునియొద్దకుఁ
దీసికొనిపోయి త్రాగించిరి. శుక్రునకు సురాపానము సేయుట
యలవాటుకావున దైత్యు లిచ్చిన యాసురను ద్రావెను. దై
త్యులు తమప్రయత్నము కొనసాగెనని సంతోషించుచు గృ
హములకుఁ బోయిరి.

సంధ్యాసమయమైనది. ధేనువులు మాత్రము గృహ
మునకువచ్చెను. కచుఁడు రాలేదు. అందులకుఁ గారణ మర
యుమని దేవయాని తండ్రికిఁ దెలిపెను. అప్పటికి శుక్రునకు
సురాపానమువలనఁ గలిగిన కొంతమత్తు తగ్గెను. ఆతఁడు తన
దివ్యదృష్టిని దానవులు చేసినకృత్యమును గ్రహించెను. ఇ
ప్పుడు కచుఁ డాతనియుదరంబులో నున్నాఁడు. ఆసంగతి
శుక్రుఁ డెఱింగెను. ఆకచుని బ్రతికించుటకు సంజీవనీవిద్యఁ
బ్రయోగించెను. దానిమహిమచేఁ గచుఁడు బ్రదికి శుక్రుని
యుదరంబున నుండెను. ఈవలకు రాలేదు. ఆతఁడు శుక్రు

నుద్దేశించి "మహాత్మా! నీయుదరమునుండి వెలువడఁజేసి రక్షింపు" మని వేడెను. ఆతని వెలువడఁ జేయుటకు శుక్రున కేమియు మార్గము దోచలేదు. అప్పుడు శుక్రుఁడు కచునితో "కచుఁడా! నీకుసంజీవనీవిద్య నిచ్చుచున్నాను. నీవునా యుదరము భేదించుకొని వచ్చి యావిద్యచే నన్ను బ్రతికింపు"మని చెప్పి, మృతసంజీవనీవిద్య కచున కుపదేశించెను. కచుఁడు వెంటనే శుక్రునియుదరము భేదించుకొని యీవలకువచ్చి, అతని కొంటకుఁ బ్రాణములఁ బోసినశుక్రుని బ్రతికించెను. సురాపానమువలన నింతస్థితి సంభవించినదని తలంచి, శుక్రుఁ డప్పటి నుండియు సురాపానము మహాపాపంబని శపించెను.

## ౨౦. ప్రహ్లాదుఁడు.

( భగవంతుఁడు అన్నిచోట్లను గలఁడు )

శ్రీహరిద్వారపాలకు లయిన జయవిజయులు దితిగర్భమున హిరణ్యాక్షహిరణ్యకశిపులై పుట్టిరి. అందు హిరణ్యాక్షుని శ్రీమన్నారాయణుఁడు వరాహరూపమునఁ జంపెను. తనతమ్ముని వధించిన శ్రీహరిపైఁ బగసాధింపహిరణ్యకశిపుఁడు దీక్షఁబట్టెను. ఆతఁడు తనభటుల కందఱికి నిట్లుచెప్పెను. "దానవులారా! నా తమ్ముని శ్రీహరి సూకరమై చంపినాఁడు. ఎట్లయినను నేను హరిని జయింపవలయును. ఆతనిరక్తముతో నేను నాతమ్మునకుఁ దర్పణములు విడువవలయును. ఆతఁడు ముఖ్యముగా మునుల యాశ్రమములయందును, క్రతువులు జరుగు ప్రదేశములందును, గోబ్రాహ్మణులయందును, భక్తుల యందును నుండును".

ఇట్లు హిరణ్యకశిపుఁడు దానవులకుఁ జెప్పి, తాను గొప్పవరములు బ్రహ్మవలనఁబొందనెంచి తపస్సుచేయుటకు మందరపర్వతమునకుఁ బోయెను. హిరణ్యకశిపుఁడు తపమునకుఁ బోయినవార్త విని, ఇంద్రుఁ డాదానవునిపట్టణంబును బ్రవేశించెను. అమరులయెదుట నిలువలేక దానవులు పాఱిపోయిరి. దేవేంద్రుఁడు రాక్షసేంద్రుని యంతఃపురముఁ బ్రవేశించి యాతనిభార్య యగులీలావతినిఁ జెఱఁగొని పోవుచుండెను. అప్పుడు లీలావతి గర్భవతియైయుండెను. తన్ను విడువుమని యామె యింద్రుని ననేకవిధములఁ బ్రార్థించెను. ఇంద్రుఁ డామెమాటలను వినక తీసికొనిపోవుచుండెను. మార్గమధ్యమం దింద్రునకు నారదుఁడు కనిపించెను. నారదుఁడు లీలావతి యేడుపు విని ఇంద్రునిఁజూచి "మహేంద్రా! ఈలీలావతి మహాపతివ్రత. ఈమెను జెఱబెట్టుట ధర్మముగాదు. అదియునుగాక ఈమెనిందుచూలాలు, విడువుము"అని పలికెను. అందులకు మహేంద్రుఁడు " నారదమునీంద్రా! నేనీమెయెడలఁ దుష్టబుద్ధిని బూని తీసికొనిపోవుట లేదు. ఈమెభర్త లోకకంటకుఁడని నీకుదెలిసియేయున్నది. ఈమె గర్భమున నొకకుమారుఁ డున్నాడు. కుమారుని గనునంతవఱకు నీమెను బంధించియుంచెదను. తరువాతఁ, గుమారుని జంపి యీమెను విడిచెద"నని బదులుచెప్పెను. ఆమాటలు విని నారదుఁడు " ఇంద్రుఁడా! ఈమెగర్భమున నున్నకుమారుని సంగతి తెలియక నీ వట్లుపలికితివి. అక్కుమారుఁడు శ్రీహరి భక్తుఁడై లోకముల నుద్ధరించును. భయమందక ఈమెను విడువు" మనెను. నారదునిమాటలు విని యింద్రుఁడు

లీలావతిని విడిచి యరిగెను. నారదుఁడు లీలావతిని దన యాశ్రమమునకుఁ దీసికొనిపోయెను. హిరణ్యకశిపుఁడు తపమునుండి వచ్చువఱకును నామెను దనయాశ్రమము నందే యుండుమని నారదుఁడు చెప్పెను. అందుల కామె సమ్మతించి యామునీంద్రుని యాశ్రమమునందే యుండెను. లీలావతి నారదునకు సేవచేయుచు నాతనివలన ననేకధర్మ ముల నెఱుంగుచుండెను. కొన్నిదినముల కామె పరమభాగవ తోత్తముఁ డయిన ప్రహ్లాదుని గాంచెను.

తపమునకుఁబోయిన హిరణ్యకశిపుఁడు బ్రహ్మను ప్రస న్నునిగాఁ జేసికొని గాలియందుగాని, అగ్నియందుగాని, భూమ్యాకాశములయందుగాని, అస్త్రశస్త్రములచేతఁ గాని, రేయింబవళ్లుగాని, మృత్యువులేకుండ వరముగాంచి పురమును జేరెను. తాను లేనప్పుడు ఇంద్రుఁడు వచ్చి లీలావతినిఁ జెఱఁ గొనిపోయెనని ఆతఁడు వినెను. ఇంద్రలోకముపై దాడివెడ లుట కాతఁ డాలోచించుచుండెను. అట్టి సమయమున నార దుఁడు, పుత్రసహిత యైనలీలావతిని హిరణ్యకశిపునికడకుఁ దోడ్కొని వచ్చెను. హిరణ్యకశిపుఁడు మిక్కిలి సంతోషించి, నారదుని ననేకవిధములఁ బొగడెను.

## విద్యాభ్యాసము.

బ్రహ్మచే వరములుపొందిన హిరణ్యకశిపుఁడు మూడు లోకములను శాధింపసాగెను. అమరు లందఱును నాతనికి భయమందుచుండిరి. తుదకు వానిబాధలు పడఁజాలక దేవ తలు శ్రీహరిసన్నిధికేగి దానవునివలనఁగలుగుచున్న బాధలు

చెప్పుకొనిరి. శ్రీహరి దేవతలను జూచి "మీరు చింతింపవలదు. సాధువులకును, గోబ్రాహ్మణులకును, నపకారముచేయువాఁ డన్నటికిని బాగుపడఁడు. ఇదియునుఁగాక, కొడుకయిన ప్రహ్లాదునిపై నాదానవేంద్రుఁ డెప్పు డలుగునో యప్పుడే వానిని వధింతునని చెప్పెను.

ప్రహ్లాదుఁడు శుక్లపక్షచంద్రుని విధమునఁ బ్రవర్ధమానుఁ డగుచుండెను. ఆతఁడు బాలుఁడయ్యును తోడిబాలురతో నాడుకొనక, యొక్కొక్కసమయమున వెఱ్ఱివానివలెఁ గన్పట్టుచుండును. ఇంకొకసమయమున శ్రీహరిని పాడుచుఁ బరుగెత్తుచుండును. వేఱొకసమయమున శ్రీహరిని బిలుచుచు గంతులువేయుచుండును. మఱియొకప్పుడు తనలోఁ దానె మాటలాడుకొనుచు నవ్వుచుండును. హిరణ్యకశిపుఁ డిదియంతయుఁజూచి, గురుఁడగు శుక్రాచార్యుని పుత్రునకుఁ బ్రహ్లాదుని విద్యనేర్పుకొనుట కప్పగించెను. గురులు ప్రహ్లాదునిఁ బాఠశాలకుఁదోడ్కొనిపోయి విద్యగఱపుచుండిరి. కొన్నిదినములకు హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునివిద్యఁ బరీక్షింపఁ దలంచి గురుసహితముగా నాతని రావించి ముద్దాడి, తనయంకమునఁ గూర్చుండఁబెట్టుకొని కుమారా! నీ వేమిచదివితివి. దానిని నాకు వినిపించి ముదముఁగూర్పు మని పలికెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు 'తండ్రీ సంసారమను నూతిలోఁబడి కొట్టుకొనకుండ, శ్రీహరిని సేవించుట మంచిదని నేను గ్రహించితి'నని బదులు చెప్పెను.

కుమారుని మాటలకుఁ దండ్రిమిగుల నద్భుతమందెను. తనకు వైరియైన శ్రీహరినిగూర్చి కొమరున కెవ్వరు బోధించిరో

యుని యాతఁడు సంశయించెను. అప్పుడు గురులు ప్రహ్లాదుని జూచి "బాలకా! నీవు పసివాఁడవు. మేము చెప్పిన చదువంతయు వ్యర్థము చేసితివి. మీతండ్రికి విరోధియైన హరిని గూర్చి పలికెద వేల," అని పలికి, దానవేంద్రునిఁజూచి "నీ వాగ్రహింపవలదు. ఈతనికి మరల నీతిఁగఱపి తోడ్కొని వత్తు"మని చెప్పి, ప్రహ్లాదుని దీసికొనిపోయిరి. గురువులెంత బోధించినను బ్రహ్లాదుఁడు హరిభక్తి మానకుండెను. అతఁడు హరిభక్తుఁడగుటయేగాక తోడిబాలురకుహరిభక్తి బోధించెను. బాలురందఱును తమతమ పుస్తకముల నావలఁబాఱవేసి ప్రహ్లాదుఁ డెట్లుచెప్పిన నట్లుసేయుచుండిరి. గురువిదియంతయుఁ జూచి తమకు ముప్పువచ్చునని దానవేంద్రున కెఱింగించిరి.

## ప్రహ్లాదుని తండ్రి శిక్షించుట.

ప్రహ్లాదునిహరిభక్తిఁ జూచిహిరణ్యకశిపునకాగ్రహము కలిగెను. శిక్షించియైనఁ గుమారునిమనస్సు త్రిప్పవలెనని యాతఁడు రాక్షసభటులఁ బిలిచి, వాని ననేకవిధముల హింసించుట కాజ్ఞనిచ్చెను. రక్కసులు బ్రహ్లాదుని నేనుఁగులచేఁ ద్రొక్కించిరి. పాములచేఁ గఱపించిరి. అగ్నిలోఁ ద్రోసిరి. ఏమి చేసినను నాకుమారుఁడు "శ్రీహరీ" యనుమాట దప్ప మఱియొకటి పలుకఁడయ్యెను. దానవు లాతనిని బాధించు నప్పుడు భయమంది పాఱిపోవలేదు. ఆతనిశరీర మేమియువాడలేదు. ముఖము కందలేదు. కన్నుల నీరు లేదు. కుమారుని హింసించుటకు రాక్షసులకే విసుగుపుట్టినది. దైత్యు లందఱు

నీవిధమును రాక్షసేంద్రున కెఱింగించిరి. ప్రహ్లాదునియెడలఁ జేసినశిక్షలన్నియు వ్యర్థమైనందుల కాతఁడు మిక్కిలి విచారించెను. ఆతనివిచార మంతకంత కాగ్రహముగా మాఱిపోయెను. ప్రహ్లాదుని దనకడకుఁ దోడ్కొనివచ్చుటకు భటుల కాజ్ఞాపించెను. అడుగడుగునకు హరినామసంకీర్తనఁ జేయుచుఁ బ్రహ్లాదుడు భటులచే హిరణ్యకశిపునిసన్నిధికిఁ దీసుకొని రాఁబడెను. హిరణ్యకశిపుఁడు కన్నులనుండి యగ్నికణములు రాల్చుచుఁ బ్రహ్లాదునిఁ జూచి యిట్లనెను. "ఓరీ! నాపరాక్రమమునకు మూడులోకములవారును భయమందుచుందురు. నీవేల నాయాజ్ఞను మీరుచున్నాడవో తెలియకయున్నది. శ్రీహరి నాకు విరోధి. ఆతడు నీపినతండ్రిని వధించినాడు. అతఁడు లోకరక్షకుఁడని యేలపలికెదవు. అతఁడు నిజమైన శూరుడైనచో నే నమరులను దండించునప్పు డేలరాడు. గురులమాటలు వినక, దైత్యబాలురనుగూడ హరిభక్తులుగాఁ జేసి రాక్షసకులధర్మములు మంటఁ గల్పితివి. ఇఁక నిన్నుఁ జంపి కులమునకు దోషము లేకుండఁ జేసెదను. నేను దిక్కుల నన్నింటిని గెల్చితిని. దేవతలందఱును నేనే దిక్కని గొలుచుచుందురు. అట్టిచో నీకెవ్వడు దిక్కగునో చూచెద. లోకమున బలవంతులందఱిలో నేనే బలవంతుడ. నీ వెవ్వనిబలము నమ్ముకొని న న్నెదిరించి పలికెదవు.

ప్రహ్లాదుడు తండ్రిమాటలకుఁ గొంచెమైనను భయమందలేదు. ఆతడు మిగులవినయముఁ జూపుచు నెమ్మదిగాఁ దండ్రి కిట్లుపలికెను. "తండ్రీ! శాంతింపుము. బలవంతులకును బలహీనులకును, నీకును, నాకును, సమస్తప్రాణులకును బ్రి

హ్మాది దేవతలకును, నెవ్వడు బలమైయుండునో, యతఁడే నాకు బలమైయున్నాడు. దిక్కు గలవారికిని, దిక్కు లేనివారికిని నెవ్వఁడు దిక్కైయుండునో, యతడే నాకు దిక్కగును. నీవు నాకుఁ దండ్రివి. దైవమువంటివాడవు. గురుడవు. నిన్నెదిరించిపలుకుటకు శక్తియున్నవాఁడను గాను. కాని సాహసించి చెప్పుచున్నందులకు మన్నింపుము. నీవు లోకములన్నియు జయించితివి,గాని, యింద్రియములనుమాత్రము జయింపలేదు. నీవు వానిని జయింపగలిగితివేని లోకములో నీకు వైరియే యుండడు. నాయనా! నామాట వినుము. బాలుఁడు చెప్పెనని తలంపవలదు. నీమనస్సును బదిలపఱచుకొనుము. శ్రీహరిని సేవింపుము. శుభములఁ బొందుము.''

కొడుకుమాటలు తండ్రికి మఱింతక్రోధము కలిగించెను. అతఁడు కుమారునిగాంచి "ఓరీ! కులద్రోహీ! చంపెదనని పలికినను భయములేక యున్నాడవు. నాతమ్ముని గూల్చిన హరిని నీవు గొలుచుచుంటివి. వానింగూల్చుటకు నేనింత వఱకు నెన్నియో శ్రమలబడితిని. లోకముల నన్నటిని వాని కొఱకు వెదకితిని. ఎందును గనబడలేదు. ఇంక వాఁ డెందుండునను జెప్పుము. వానిం గూల్చెద'' ననిపలికెను.

ఆమాటలకుఁ బ్రహ్లాదుడు చేతులు జోడించి శ్రీమన్నారాయణుని కీర్తించుచుఁదండ్రిని గాంచి యిట్లనెను. తండ్రీ శ్రీహరి యిందు గలడు, అందు లేడు, అను సందేహముతోఁ బనిలేదు. ఎచ్చటఁజూచినను గనిపించును.

ప్రహ్లాదునివాక్యములు విని హిరణ్యకశిపుఁడు కోపము రెట్టింపఁ గుమారుని గాంచి 'ఓరీ! శ్రీహరి సమస్తప్రదేశముల

యందు నుండునని పలికితివి. నీ వాతని నీసభాస్తంభమునఁ జూపగలవా' యనెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు "తండ్రీ! పిపీలికాదిబ్రహ్మపర్యంతము నిండియుండు శ్రీహరి యీసభాస్తంభమునమాత్ర మేలయుండడు. నీవుసంశయింపవలదు. అతఁ డిందు తప్పకయుండు"నని బదులుచెప్పెను. కుమారుఁ డట్లు పలుకఁగానే రాక్షసేంద్రుఁడు మండిపడుచు హరి నిందుఁజూపుమని సభాస్తంభమును నఱచేతఁ గొట్టెను. అంతటనరసింహ రూపమునఁనొప్పు శ్రీమన్నారాయణుఁ డాసభాస్తంభమునుండి బయలువెడలెను. భయంకరరూపుఁడైననరసింహమూర్తినిజూచి హిరణ్యకశిపుఁడు తనలో "ఆహా! ఈయాశ్చర్య మేమి? ఇది కేవలము మానవరూపము కాదు. మృగరూపము గాదు. ఇదియంతయు హరిమాయగా నున్నది. బాలునిపలుకులు సత్యముచేయుటకు శ్రీహరి యిట్లు వచ్చినాడు. ఈతనిచేనాకు మరణముసంభవించుట సత్యమని తోచుచున్నది. నాశౌర్యమైనను హరికిఁ దెలియుటకై పోరాడెద"నని తలఁచి గదాదండమును బూని యానరహరి నెదుర్కొనెను. నరసింహదేవుఁ డారాక్షసు నొడిసిపట్టి, నరరూపము, మృగరూపము గాని నరరూపమున-పగలును, రాత్రియుఁ గాని సంధ్యాసమయమున - భూమియు, నాకాశముగాని యూరు ప్రదేశమున - యుద్ధరంగము, గృహస్థలముగాని సభామందిర ద్వారమున- అస్త్రములు, శస్త్రములుగాని నఖముల - ఆదైత్యరాజును వధించెను. ప్రహ్లాదుఁడా భగవంతునిఁ బెక్కుభంగుల వినుతించెను. శ్రీహరి యాప్రహ్లాదున కనేకవరము లిచ్చి యంతర్ధానుఁడయ్యెను.

## ౨౧. వానరము - పక్షి

(దుర్మార్గులకు సద్బోధచేసినవారి కొకప్పుడు హాని కలుగును)

ఒక మహారణ్యమున నొకవృక్షముపైఁ గూడుకట్టుకొని యొకపక్షి నివసించుచుండెను. ఒకనాటిరాత్రి జగమంతయు నంధకారముచే నావరింపఁబడి గొప్పవర్షము కురియసాగెను. ఆ సమయమున నెచ్చటనుండియో యొకకోఁతి యాచెట్టుక్రిందికి వచ్చి చలిచే వడకుచుండెను. వృక్షముపైనున్న పక్షి యా వానరమును జూచి మిగుల జాలినంది "వానరమా! నీవు చలిచే మిక్కిలి బాధనొందుచున్నావు. కావున నీచెట్టుపైకి వచ్చి కొమ్మలసందుననైన గూర్చుండు" మని పలికెను. అంత వానరము చెట్టెక్కి శాఖలమధ్యమున నుండెను.

తన గూటికి దగ్గఱగాఁ గూరుచున్న మర్కటమును జూచి సద్భావముగల యా పక్షి యిట్లు పలికెను. "ఇట్టి సమయమున నాయింటి కతిథివైన నిన్నుఁ బూజించుటకుఁ దగినశక్తి గలదాననుగాను. గూటిలోనికైన రమ్మనుట కిది మిక్కిలిచిన్నది. ఇయ్యవి పక్షులకె నివాసయోగ్యములుగాని నీవంటివారికిఁ జాలవు. పక్షులమైనను మేమిట్టి నివాసముల నేర్పఱచుకొనుటచేతఁ గొంచెము సుఖముగాఁ గాలముగడుపు చుందుము. నీకు మాకన్న బుద్ధి యధికము. నీవుగూడ నెక్కడనైన నొక్కనెలవు నేర్పాటుచేసికొని యున్నచో నిట్టి బాధఁ బొందియుండవుకదా!

మంచి చెప్పిన పక్షిమాటలు వానరమున కాగ్రహము గలిగించెను "తనకు నిలయమున్నదఁట నాకులేదఁట. ఇదినాకు

బుద్ధిగలపునంతటిదా" యని తలంచి యావానరము పక్షినిజూచి "నీవు నాకన్న బుద్ధిగలదాన వగుటచే గూడు గట్టుకొంటివి కాబోలు! నాకు నివాసము లేదని పరిహాసమాడుచు నివాస మేర్పరచుకొమ్మని బోధించుచుంటివా! నీవెంత! నీసౌఖ్య మెంత! నీగూడెంత!" యని పలికి, గూటిలోనున్న పిల్లలు కీచు కీచు మనుచుండ నాగూటిని పీకి చెట్టునకు బ్రక్కనున్న ప్రవాహములోఁ బాఱవేసెను. పాపము! ఆపక్షి యేమిచేయఁగలదు? దుర్బుద్ధిగల యావానరమునకు మంచి చెప్పుటచే నాకే హాని సంభవించెనుగదా! యని దుఃఖించెను.

## ౨౨. సింహము - మూషికము

( ఒకప్పుడు చిన్నవారే పెద్దవారిని గాపాడఁగలరు )

ఒకనాఁడొక సింహము తన నివాసమైన గుహయందు నిద్రించుచుండెను. అట్టి సమయమున నొకమూషిక మెచ్చటికో తొందరగాఁ బోవుచు నాసింహము ముందుకాలిమీఁదఁ బడెను. సింహ ములికిపడి లేచి, యాయెలుకను బట్టగా నయ్యది మిక్కిలి భయమందుచు దీనస్వరముతో సింగమున కిట్లనెను. సింహమా! నీవుమృగములకు రాజువు. నేనల్పజంతువును. నన్నుఁజంపినందువలన నీకు లాభమేమియును లేదు. ఆకలితీరదు. బుద్ధిపూర్వకముగా నేనునీకునిద్రాభంగము సేయ లేదు, తొందరగాఁ బోవుటలోఁ బొరపాటున నీకాలిమీఁదఁ బ్రాకితిని. నాయపరాధమును మన్నించి నన్ను రక్షింపుము. నీ కాపదసమయమున నే నడ్డుపడుదును. చిన్న జంతువుకదా యని తలంపవలదు. కరుణించి నన్ను విడిచిపెట్టుము.

ఎలుకమాటలకు సింహమునకు నవ్వువచ్చెను. అది యెలుకం గాంచి మృగరాజునగు నాకు ఆపదసమయమున నీ వడ్డుపడుదువా! ఏమయినను నీయందు నాకు జాలికలిగినది. కావున నిన్ను విడుచుచున్నానని పలికి విడిచిపెట్టెను. ఎలుక తనకలుగులోనికిఁ బోయెను.

పెక్కుదినములుగడచెను. ఒకనాడు సింహము ఆహారమునకై బయలుదేరి, యందందుఁదిరుగుచు, నొకచోట వేటకాడు ఒడ్డినయురిలో జిక్కుకొనెను. "అయ్యో! మృగరాజునైన నే నురిలో జిక్కితిని దీనిం దప్పించుకొనుటకు నాకు మార్గమేమియుఁ దోచకయున్నది. వేటకాడు వచ్చి నన్నుజూచి వధించును. ఇప్పుడు నేనేమి సేయుదును? ఈయురినుండి యెట్లు తప్పించుకొందును" అని విచారించు చుండెను. అప్పు డింతకు బూర్వము సింగముచేరక్షింపఁబడినమూషికమచ్చటికివచ్చెను సింహము దానింజూచి "మూషికమా! నే నీయురియందుఁ జిక్కినాను. "నీకాపద కడ్డపడెద"నని మున్ను నీవు చెప్పియున్నావు. నీచేత నయ్యెనేని నన్నీయురినుండి తప్పించి రక్షింపు" మనెను. అందులకు మూషికము "మృగరాజా! చింతింపకుము. నీవునాకుఁజేసిన ప్రాణదానమును మఱచియుండలేదు. ఉపకారము జేసినవారికి అవసరమువచ్చినప్పుడు మరలనుపకారము జేయని వానిబ్రతుకు వ్యర్థము. నేను క్షణములో నిన్నీయురినుండి తప్పించెదనని పలికి, యాయురిత్రాళ్ళను తొందరగాఁ గొరికి వేసెను. అంతట సింహము సంతోషముతో నీవలకువచ్చి "మూషికమా! నాకెంతటి శక్తియున్నను ఈ యురినుండి తప్పించుకొనలేకపోయితిని. నేను నీవలన రక్షింపఁబడి

తిని. నీవన్నమాట నిలుపుకొంటివి. నీయుపకారమును నేను మఱువఁజాలను. నేటినుండి మనము ప్రాణస్నేహితులమైతిమి. అనుదినమును నీవు నానివాసమునకు వచ్చి పోవుచుండుము" అని పలికి, తన నెలవునకుఁబోయెను. మూషికము తనకలుగుఁ జేరెను.

## ౨౩. కిరాతుఁడు - శుకము

( తనకు సాధ్యముగాని శత్రువు నుపాయముచే మఱియొకనిచేనైనఁ జంపింపవలయును )

ఒక భయంకరమైన యడవిలో నొకవెలగమ్రాని తొఱ్ఱయందొక చిలుక యుండెను. దాని పిల్లలను - కిరాతు డొక్కఁడు వచ్చి - తీసికొనిపోయి, యెవ్వరికైన విక్రయించు కొనుచుండును. ఆ శుక మెప్పుడు గ్రుడ్లనుబెట్టి పొదుగునో-యని వా డెప్పుడును చూచిపోవుచునే యుండును. ఇందుచేత నాశుకమునకు మిగుల దుఃఖము కలిగెను. ఒకనా డది తన మనస్సులో "అయ్యో! యీబోయవాఁడు నాపిల్లల నెప్పటి కప్పుడు తీసికొనిపోయి, నాకు శోకము గలిగించుచున్నాఁడు. వీని బారినుండి నాపిల్లలను రక్షించుకొనవలయును. ఏయుపా యముచేతనైన నీకిరాతునిఁ జంపవలయునని తలంచెను.

అంత నొకనాఁడు బోయవాఁడు వచ్చి చిలుకపిల్లలను బట్టుటకుఁ జెట్టెక్కుచుండెను. అప్పు డాశుకము బోయవానిం జూచి యిట్లు పలికెను. "నీవు నాపిల్లలను దీసికొనిపోవు చుంటివి. ఇందువలన నీకు వచ్చుగొప్పలాభ మేమియున్నది? నీవు వీని నెవ్వరికైన విక్రయించినచో నీకుఁగొంచముధనమే యిచ్చెదరు. దానిచే నీకొకరోజుకన్న నెక్కువ గడవదు.

నాపిల్లలనుబట్టుట మానుము. నీకు నెక్కువగ ధనము లభించు నుపాయముఁ జెప్పెదను. ఆధనముచేత నీవు - నీపిల్లలతోడను, భార్యతోడను సుఖముగా జీవించవచ్చును. ఇచ్చటికిఁ గనుచూపు దూరములో నొకమర్రి చెట్టున్నది. దానితొఱ్ఱ యందు నిన్నటిదినంబునఁ దెల్లవారు జామున నిరువురు - చోరులు అనేకవిధములైన బంగరు నగలును-పెక్కురత్నము లును దాచుచుండఁగా నేను చూచితిని - అదియును గాక వారు మరల వానిని నాలుగు దినములలోఁ దీసికొనిపోవఁ దలంచినట్లు వారిమాటలవలన వింటిని. కావున నీ వాయా భరణములను దీసికొనిపోయి సుఖముగా బ్రతుకుము. నావెంట వచ్చితివేని నీ కాధనమును దాచిన తొఱ్ఱను జూపించెదను.

శుకము మాటలు వినినంతనే బోయవాడు వెలగమ్రా నినుండి దిగెను. వానికి ధనముపై నాశగలిగెను. వాడు శుక మునుజూచి 'ఓకీరమా! నేను కడుబీదవాఁడ నగుటచే నీపిల్ల లను గొనిపోయి యమ్ముకొనుచుంటిని. నేటినుండి నీపిల్లల జోలికిరాను. నీవుచెప్పిన విధమునఁ జోరులు ధనము దాచిన వృక్షమును జూపు' మనెను. శుక మాబోయవానిని వెంటఁబె ట్టుకొని యచ్చటికిఁ గొంచెము దూరములోనున్న యొకమఱ్ఱి చెట్టు దగ్గరకుఁ దీసికొనిపోయెను. ఆమఱ్ఱిచెట్టు తొఱ్ఱయం దొక భయంకరమైన త్రాచుపామున్నది. ఈసంగతి చిలుకకు దెలియును. బోయవాని నెట్లయిన నాత్రాచుచేఁ జంపింపవల యునని తలంచియే చిలుక వానినిచ్చటకుఁదోడ్కొనివచ్చెను. శుకము బోయవానిఁజూచి "ఇదియే మఱ్ఱిచెట్టు. దానికున్న

పెద్దతొఱ్ఱయందే చోరులు ధనము దాచిరి. నీ వాతొఱ్ఱలో
నికిఁ జేయిఁబోనిచ్చి వారు దాచినధనముఁ దీసికొనుము" అని
పలికెను. చిలుకచెప్పిన మాటవిని బోయవాఁ డాచెట్టుతొఱ్ఱ
యందుఁజేయిఁబెట్టెను. వెంటనే, యందున్న త్రాచుపాము
"బుస్సు"మనుచు నీవలకువచ్చి వానింగఱచెను. విషముతలకెక్కి
యాబోయవాఁడు మృతినందెను. ఇట్టియుపాయమునుబన్ని తన
పిల్లలను రక్షించుకొంటిని గదాయని శుకముసంతోషించెను.

# ౨౮. మనుష్యుఁడు - బాతు

( ఆశ యెట్టిదుష్కార్యమునైన జేయించును )

పూర్వ మొకపురమున నొకకాపువాఁ డుండెను. ఆ
తఁడు మిక్కిలి పేదవాఁడు. చాలమంది పిల్లలు గలవాఁడు. శరీ
రమున శక్తియున్నంతవఱకు, పకూలియో చేసికొనిసంసారము
గడపెను. ఆతఁడు వృద్ధుఁడయ్యెను. సంసారము నెట్లు పోషిం
తునాయని విచారింపఁదొడఁగెను. ఆతఁడు సిరుపేదయయ్యును
నెన్నఁడు నబద్ధమాడి యెఱుఁగఁడు. అన్యాయమునకు వెఱచు
చుండును. భగవంతునియందు భక్తిగలవాఁడు. తానుకష్టపడి
తెచ్చిన దానితో సంతృప్తిఁ బొందుచుండువాడు ఆతఁ డొక
నాఁడు దేవాలయమునకుఁబోయి, తన్ను రక్షింపుమని శ్రీహ
రిని వేడికొనెను. శ్రీహరి యాకాపువాని భక్తికి సంతసించి
ప్రసన్నుఁడయ్యెను. కాపువాఁడు శ్రీహరి పాదములపైఁ దన
శిరముఁ బెట్టి నమస్కరించి యనేకవిధములఁ బొగడెను.

శ్రీహరి వానింజూచి "ఓయీ! నేను నీసుగుణములకు
మెచ్చినాను. నీకేమి కావలయునని పలికెను. కాపు వాఁడు

చేతులు జోడించి, యాదేవునితో నిట్లనెను. 'దేవా! నాకు దిక్కు నీవేయని నమ్మియున్నాడను. పిల్లలుగలవాఁడను. వృద్ధుఁడను. సంసారముఁబోషించుటకు మిగుల శ్రమపడుచున్నాను. కావున రక్షింపుము.''

శ్రీమన్నారాయణుఁడు కాపువాని మాటలువిని, వాని కొక బాతునిచ్చి "నీవు దీని నతిజాగ్రత్తతోఁ బెంచుము. దీని వలన నీదారిద్ర్యము పోవును"అని చెప్పి యదృశ్యుఁడయ్యెను. భగవంతునిచే నీయఁబడిన బాతును గైకొని, కాపువాఁడు గృహమునకువచ్చి భార్యతో జరిగిన సంగతిఁ దెలిపి, యాబాతును బెంచుమనిచెప్పి, దానినిచ్చెను. అందులకు భార్య నవ్వి "ఇదియేమివింత, శ్రీహరికి నీయందు దయకలిగినచో ధనమీయవలయును గాని ఈ బాతువలనఁ బ్రయోజన మేమియుండును? దీనివలన మనదారిద్ర్యము పోవునా! అనెను. నీవట్లు తలంపవలదు. భగవంతునిమాటలు వ్యర్థముగావు. నీవుమాత్ర మీబాతును జాగ్రత్తగాఁ బెంచు''మని కాపువాఁడు భార్యకుఁ జెప్పెను.

కాపువానిభార్య - ఆబాతునకు నాడుచక్కని యాహారమిడి, రాత్రిసమయమున నొక గంపక్రిందఁ బెట్టెను. భగవంతుఁ డిచ్చిన యాబాతువలనఁ దమదారిద్ర్య మెట్లు పోవునాయని యామె యాలోచించుచుండెను. మఱునాఁడుదయముననే యామె, గంపఁ దీసిచూచునప్పటికి, బాతు ప్రక్క నొక బంగరు గ్రుడ్డుండెను. దానిం జూచినయంతనే యామె సంతోషమును బట్టఁజాలక - మగనిం బిలచి చూపించెను. కాపువాఁడు భార్యంగాంచి "భగవంతునిమాట అసత్య

మగునా! భగవంతుఁ డిచ్చిన దీనికి మనము తృప్తిఁబొంది సుఖముగాఁ గాలము గడుపవచ్చు"నని పలికెను.

కాపువానిభార్య యా బంగరు గ్రుడ్డును వర్తకుని యొద్దకుఁ దీసికొనిపోయి, దీని నెంతవిలువకుఁ దీసికొందు వని యడిగెను. వర్తకుఁ డాసువర్ణాండమును దీసికొని యైదు వందలరూకలిచ్చెదనని చెప్పెను. కాపువానిభార్య యందులకు సమ్మతించి - యాగ్రుడ్డును వాని-కిచ్చి యైదువందల రూకలను దెచ్చుకొనెను - అంతకు ముం దెప్పుడును అంతసొమ్ము నామె చూచి యెఱుఁగకపోవుటచే సంతోషమునకు మితిలేక పోయెను. భార్యవలనఁ గాపువాఁ డీసంగతి విని యతఁడును సంతసించి, ఇది భగవంతుని దయవలన లభించినదనితలంచెను.

మఱునాటి యుదయమున బాతుప్రక్క మరల నొక బంగరు గ్రుడ్డుండెను - కాపువానిభార్య దానింగాంచి, మరల వర్తకునియొద్దకుఁ గొనిపోయి యైదువందల రూకలఁ దెచ్చుకొనెను. రెండుదినములలో వేయిరూకలులభించినందు లకు ఆమెమిక్కిలి సంతోషించెను - ఆసంతోషము తుదకు దురాశగా, మాఱిపోయెను - బాతుకడుపులోనింకెన్నో గ్రు డ్లుండుననియు, వాని నన్నిటిని ఒకసారిగా దీసినచో ఎక్కువ సొమ్ము వచ్చుననియుఁ దలంచెను-వెంటనే యామె యాబా తును వంటయింటిలోనికిఁ దీసికొనిపోయి యొకకత్తిచే దాని పొట్టను జీల్చెను. బాతు ప్రాణములు విడిచెను. దాని కడు పులోఁ బ్రేగులుదప్ప నేమియు లేవయ్యెను. ఆసమయమునఁ గాపువాఁడు గృహమున లేడు - ఇట్టిపనిఁ జేసినందుల కతఁడు

వచ్చి యేమనునోయని యామె విచారించుచు వీధి వాకిట నిలిచియుండెను. కొంతసేపటికిఁ గాపువాఁడు వచ్చెను- ఆమె విచారముగానున్నట్లు గ్రహించి యందులకుఁ గారణ మడిగెను. ఆమెచేసిన దుష్కార్యమును భర్త కెఱిఁగించెను. కాపువాఁడు లోపలికిఁబోయి భార్యచేఁ జంపఁబడిన బాతును జూచి విలపించి భార్యతో భగవంతునిచే మనకుఁ బ్రసాదింపఁబడిన యీబాతును జంపి నీవు కడుపాపము గట్టుకొంటివి - దురాశయే నిన్నిట్టి దుష్కార్యము చేయించినది- భగవంతుఁ డిచ్చినదానినిగూడ ననుభవింపలేకపోయితివి - ఇఁక నీవును పిల్లలును నెట్లు జీవింతురో - నా కవసరము లేదు - నేను శ్రీహరిని సేవించుచుఁ గాలము గడపెద” నని పలికెను.

## ౨౫. ముసలి కుందేలు

( బుద్ధిబలమునకు మించినది లేదు )

ఎండ లధికమగుటచే నొకప్పుడు అరణ్యముననున్న తటాకములన్నియు నెండిపోయెను. ఏనుగులకు నీరు దొరకక మిక్కిలికష్టపడవలసివచ్చెను. ఆయేనుగులన్నియునుఁ దమయూథపతినిజూచి “ఈయడవిలో మన కెక్కడను నీరు లభించుట లేదు. ఇఁక మన మిచ్చట నుందుమేని ప్రాణములు నిలువవు. ఎక్కడనైనను సమృద్ధిగా జలంబున్నస్థలమునకుఁ జేరవలయు” నని చెప్పెను.

తరువాత నా యేనుగులన్నియు బయలుదేరి, జల
మున్న ప్రదేశమును వెదకుచుఁబోయెను. తుదకొకచోట సం
పూర్ణముగా జలమున్న తటాక మాయేనుగులకుఁ గనబడెను.
అవ్వా డాయేనుగులకుఁ గలిగిన సంతోషమునకు మితిలేక
పోయెను. ఆచెఱువునకు సమీపముననున్న యొక యరణ్య
ములో నాకుంజరములు నివసించుచుఁ బ్రతిదినమును నాతటాక
మునకు నీరుత్రాగుటకు వచ్చుచుండెను. ఆ యేనుగులువచ్చు
దారిలో - చెఱువుగట్టునకు సమీపమునఁ బెక్కు కుందేళ్లు
వసించుచుండెను. ఏనుగులు నీరుత్రాగుటకు వచ్చునప్పుడు
వానికాళ్ళక్రిందఁ బడి నలిగి, ప్రతిదినమును గొన్ని కుందేళ్లు
చచ్చిపోవుచుండెను. అందుచేతఁ గుందేళ్ళ సంఖ్య నానాటికి
దగ్గిపోవుచుండెను. తమవా రందఱును నేనుగుల కాళ్ళ
క్రిందఁ బడి నలిగి చచ్చిపోవుచున్నవిగదా యని కుందేళ్లన్ని
యు విచారింపఁ దొడంగెను. అట్టిసమయమున నొక ముసలి
కుందేలు తక్కినవానిని జూచి "మీరీరీతిని విచారించినందు
వలనఁ బ్రయోజనములేదు. మన మేదయిన నుపాయమాలో
చించి, ఆకుంజరము లిచ్చటికి రాకుండఁ జేయవలయును. నేను
బాగుగా నాలోచించి నేడే మంచియుపాయ మరసెదను.
మీరు విచారింపవలదు" అని చెప్పెను.

ఆనాటి సాయంకాలమున నేనుఁగులు నీరుద్రాగుటకు
వచ్చుసమయమున నా ముసలి కుందేలు - మార్గముననున్న

నొకగుట్టపైఁ గూర్చుండి యుండెను. ఏనుగులు వచ్చుచుం
డెను. అప్పుడు **ముసలికుందేలు** ఏనుగుల యధిపతింగాంచి
'కుంజరనాథా! నిలువుము. నీతోనొకమాటఁ జెప్పవలసియు
న్నది,' యని పలికెను. కుంజరేంద్రుఁడు తనవారితో నిలిచి
"నీవెవ్వరవు? నాతో నేమిచెప్పవలసియున్న" దని పలికెను.
అందులకుఁ **గుందేలు** "నేను కుందేలును. చంద్రునిచేరక్షింపఁ
బడుదానను. అతని పంపున నీకడకు వచ్చితిని- ఆతఁడునీతోఁ
జెప్పుమన్న మాటలఁ జెప్పెద"నని పలికి, చంద్రునివాక్యము
లుగా నిట్లు చెప్పెను. "ఓమత్తేభములారా! మీ రనుదినము
నీరు ద్రావుచుండు జెఱువునాయది. నేనందే నివసించుచుందు
ను. దానిగట్టున నుండు కుందేళ్లన్నియు నాచేరక్షింపఁబడుచుం
డును. మీరిచ్చటికి వచ్చుచుండుటచేఁ జెఱువులోని నీరంత
యుఁ జెడిపోవుటయేగాక, కుందేళ్ళన్నియు మీకాళ్ళక్రిందఁ
బడి నలిగి చచ్చిపోవుచున్నవి. నాయెడల మీరు మహాప
రాధ మొనర్చుచున్నారు. నేటినుండియుమీరాతటాకమునకు
రావలదు."

కుందేలు చెప్పిన చంద్రుని వాక్యములు విని, యా
కుంజరనాథుఁడు మిగుల విచారించెను. ముసలికుందే లా
యేనుఁగునజూచి "నీవిప్పుడు నాతోవచ్చి చంద్రుని క్షమా
పణగోరుకొ"మ్మని తెలిపి, తక్కినవానితోఁగూడ నాకుంజ

రేంద్రుని వెంటఁబెట్టుకొని చెఱువునొద్దకుఁబోయెను. నాఁడు పౌర్ణమియగుటచేఁ జంద్రుఁడు సంపూర్ణముగాఁ బ్రకాశించుచుండెను. ఆతని బింబము చెఱువునందుఁ బ్రతిఫలించుచుండెను. ముసలికుందేలాయేనుగులఁజూచి "అదిగో భగవంతుఁడైన చంద్రుఁడు చూడుఁ" డని చెప్పి నీటిలోనున్న చంద్రబింబమును జూపెను. ఏనుగు లన్నియు నాచంద్రుని ప్రతిబింబమునకు నమస్కరించి "దేవా! మేము నీయెడల మహాపరాధము జేసినాము. క్షమించవలయును. ఇఁక మేమీచెఱువునకు రాము" అనిపలికి, వెడలిపోయెను.

ముసలికుందేలు తన నివాసమునకుఁబోయి, తాను చేసిన యాకార్యమును తనవారి కెఱింగించెను. వారందఱును ముసలికుందేలు బుద్ధిబలంబునకు సంతసించిరి. నాటినుండియు నేనుగులు చెఱువునకు రాకపోవుటచేఁ గుందేళ్ళ కేవిధమైన బాధయుఁ గలుగక సుఖముగా నుండెను.

సర్వము సంపూర్ణము.

